Regd No. N. 45 / M 3813

వెల ఒక అణా



ఫ్రెంచి కాలనీలలో ఇంకను తిరుగుబాటు

బర్లినుపై బ్రిటనుదాడులు

ప్రతి సోమ, గురు వారములందు వెలువడు జాతీయ పత్రిక

సంపుటము ౧౫ హైద్రాబాదు-దక్కన్ శా. శ. ౧౮౬౨ విక్రమసం॥ భాద్రపద శు॥ ౮ (౯-౧౨-౧౩౪౯ ఫ.) సోమవారము సంచిక ౩౬

# రుమేనియాలో జనుల అల్లరులు

## హంగరీకి భూమినిచ్చుటచే ఆగ్రహము

### జర్మను అధికారుల ఆక్షేపణ

రుమేనియాకును హంగరీకిని ట్రాన్సిల్వేనియా విషయములో వచ్చిన వివాదములో జర్మనీయు, ఇటలీయు మధ్యవర్తి పరిష్కారముచేసినట్లును, దానిని రుమేనియా అంగీకరించినట్లును గత సంచికలో చూచియుంటిమి. జర్మనీ, ఇటలీలు రుమేనియా ప్రభుత్వమునకు పంపిన ఒక అంత్యసందేశములో ట్రాన్సిల్వేనియా విషయమై తాము చేయు మధ్యవర్తి పరిష్కారమునకు అంగీకరించక తప్పదని హెచ్చరించెను, లేనిచో హంగరీతో యుద్ధము తప్పదని బెదరించెను. అందుపై ఆగస్టు ౨౯వ తేది రాత్రి క్రౌను కౌన్సిలు సమావేశమై ఆ అంత్యసందేశమును ఆలోచించి జర్మనీ, ఇటలీల పరిష్కారమును అంగీకరించుటకు తీర్మానించి, వియన్నాలోని తమ ప్రతినిధులకు ఆసంగతి తెలియజేసెను. రుమేనియా మంత్రివర్గముకూడ ఆగస్టు ౨౯వ తేది సాయంకాలమునుండి సమావేశమై ఆలోచించుచునేయుండెను. ఆగస్టు ౩౦వ తేది మధ్యాహ్నము వియన్నాలో జర్మనీ, ఇటలీలు గావించిన పరిష్కారమును అంగీకరించుచు ఒడంబడిక పత్రముపై రుమేనియా, హంగరీల ప్రతినిధులు సంతకములను వ్రాసిరి.

**ఒడంబడిక**

ఈపరిష్కారముచే రుమేనియా ప్రభుత్వము వారు ట్రాన్సిల్వేనియాలోనుండి ౧౮౦౦౦ చదరపు మైళ్ళు (౪౫౦౦౦ చదరపు కిలోమీటర్లు) ప్రదేశమును హంగరీకిచ్చివేయవలెను. ట్రాన్సిల్వేనియా ప్రధాననగరమగు క్లజ్ కూడ ఇచ్చివేయవలెను. హంగరీకిచ్చువేయు ప్రదేశంలో రుమేనియనులెవరుగాని రుమేనియా జాతీయతతోనే యుండదలచుచో వారలు ఒడంబడిక ప్రకారము రుమేనియాకు ఒక సంవత్సరములోగా పోవచ్చును. వారలువదలిపెట్టిపోవలసివచ్చు స్థిరాస్తికి పరిహారమునిచ్చెదరు. హంగరీకిచ్చిన ప్రదేశములోనుండి రుమేనియా సేనలు ౧౫రోజులలోగా లేచిపోవలసియుండును. రుమేనియా, హంగరీల మధ్య సరిహద్దులను విస్పష్టముగా నిర్ణయించుటకు హంగరీ రుమేనియాల ప్రతినిధులుగల ఒక ఉపసంఘము ఏర్పాటుచేయబడును.

జర్మనీ, ఇటలీల పరిష్కారమును రుమేనియా అంగీకరించినందున ఇక మిగిలియున్న రుమేనియా రాజ్యభాగము విచ్ఛేదముకాకుండ జర్మనీ ఇటలీలు పూచీనిచ్చినవి.

రుమేనియాలోను హంగరీలోను అల్పసంఖ్యలోనుండి జర్మనుప్రజలు తమ నేషనల్ సోషలిజం సంబంధమైన ఆశయములను పోషించుకొనుటకు ఎట్టి ఆంకము లుండకుండచేయునట్లు రుమేనియా, హంగరీ ప్రభుత్వము లొప్పుకొనినవి.

**రుమేనియా నష్టము**

ఇపుడు రుమేనియా హంగరీకిచ్చిన ప్రదేశములో ౨౪౦౦౦౦౦మంది జనులుగలరు. అందులో ౧౪౦౦౦౦౦ మంది రుమేనియనులు. ౧౦ లక్షల మంది హంగేరియనులు. ఈప్రదేశములో గోధుమలు విస్తారముగా పండును. బంగారు మైకాగనులున్నవి. రుమేనియాయొక్క పశ్చిమదుర్గములు ఈప్రదేశములోనే యున్నవి ఇంతకుపూర్వమే రష్యాకు పోయియుండిన బెజరేబియా, బుకోవినాలును, బల్గేరియాకిచ్చిన డోబ్రుజాయు పోతే ఇంక మిగిలిన రుమేనియా ౧౯౧౯ లో నున్నస్థితిలో నుండగలదు. ఇది నిజముగా రుమేనియాకు తలవంపులైన నష్టమే. కాని బలవద్రాజ్యముల ఒత్తిడిద్వారా వేరేసహాయములేని స్థితిలో అందుకు రుమేనియా ఒప్పుకొనక తప్పినదికాదు.

ఈఒడంబడికవల్ల రుమేనియా జాతీయ ప్రజలు ఆగ్రహముచెంది తిరుగుబాటుచేసెదరేమో యను భయములో, పోలెండులో జర్మనీవారాక్రమించినప్రదేశానికిని రష్యావారాక్రమించినప్రదేశానికిని మధ్యసరిహద్దుపొడవునను పైయరుఅనుచోట జర్మనుసేన లుంచబడెను. ట్రాన్సిల్వేనియాలో కొన్ని ముఖ్యస్థలాలలోకూడ జర్మనుసేన లుంచబడెను. అనుకొన్నట్లే ట్రాన్సిల్వేనియాలోను, రుమేనియాలోను, రుమేనియా జాతీయప్రజలు ఆగ్రహోదగ్రులైరి. ట్రాన్సిల్వేనియా ప్రధాననగరమగు క్లజులో ఒక పెద్దగుంపు హంగరీవారి ఒక నాటకశాలపైబడి, దానిని ఛిద్రపరచెను. రుమేనియా హంగరీలకు వియన్నాలో కుదుర్చబడిన ఒడంబడికను రద్దుచేయవలసినదిగా ట్రాన్సిల్వేనియాలోని రైతునాయకుడు మనియోగారు హిట్లరు, ముసోలినిగార్లకు తంతిసందేశమునంపిరి.

రుమేనియా క్రౌన్ కౌన్సిలున్ను, రుమేనియా విదేశాంగమంత్రి మానోయిలెస్కుగారును ఇపుడు అంగీకరించిన ఒడంబడికను విధిలేక అంగీకరించవలసివచ్చినదిగనుకను, ఇప్పటికైనను జర్మనీ ఇటలీలు రుమేనియా రాజ్యమునువది అపలేకుండపోయే పరిస్థితిని తప్పించినందుకు తృప్తిపడి, ఓపిక వహించి భవిష్యత్తుకు కావలసిననిర్మాణమును చేసికొనుము జర్మనీ, ఇటలీలకనుకూలముగా మెలగుటవుంచిదనియు ప్రకటనలచేసి ప్రజలనుఓదార్చయత్నించిరి. కాని రెండు రోజులవరకు ఆగ్రహావిష్టులైన ప్రజలను నిగ్రహించుటను సాధ్యము కాదయ్యెను.

**అల్లరులు**

ఆగస్టు ౩౧వ తేది రాత్రి రుమేనియా ప్రధాననగరమగు బుఖారెస్టులో గొప్పగుంపు యూనివర్సిటీకి వెలుపలచేరి గోలపెట్టెను. బుఖారెస్టులోనుండు హంగరీ, ఇటలీ, జర్మను రాయబారుల కార్యాలయముల చుట్టును, వీధులలోను పోలీసుకాపలా ఏర్పాటుచేయబడెను. రుమేనియా అంతటను సెప్టెంబరు ౧వ తేది జరుగవలసిన ఆటలపోటీలును, సంగీతకాలక్షేపములును ఆపివేయబడెను. బుఖారెస్టులోని ఇటలీ రాయబారికార్యాలయపు గవాక్షములను గుంపుపగులగొట్టెను. గుంపులను నీటిగొట్టములతో నీరుచల్లి తరిమివేయవలసివచ్చెను. పోలీసులకును గుంపులకును సంఘర్షణలుకూడ జరిగెను. రుమేనియా-హంగరీల ఒడంబడికను తిరస్కరించవలసినదని కేకలువేయుచు ఒక రైతుల ఊరేగింపుతీయబడెను ట్రాన్సిల్వేనియాలో బ్రేసోవులో ౧౦ వేలమంది రుమేనియనులు ఒక మైదానములోకూడి హంగరీకి ఒక అంగుళముభూమికూడ ఇచ్చేదిలేదని ప్రమాణముచేసినరి. తర్వాతవెంటనే ఇద్దరు జర్మను అధికారులను ఒకగుంపుముట్టడివేసి స్వాస్తిక పతాకమును చించివేసెను. పోలీసువారువచ్చి గుంపులతోలగించి ఆజర్మను పెద్దమనుష్యులను సందుచేసిరి గుంపువారు జర్మనురాయబారి కార్యాలయము ప్రవేశించి హిట్లరు పటమును పగులగొట్టిరి. సెప్టెంబరు ౧వ తేదినాడు హంగరీ రుమేనియాల సరిహద్దుల నిర్ణయింపు ఉపసంఘము ట్రాన్సిల్వేనియాలోని ఓరాడియామారికివచ్చినపుడు కూడ జర్మనీ ఇటలీల పరిష్కారము మాకువద్దుఅని జనులుగోలపెట్టిరి.

రుమేనియాలోని టిమిస్వారులోకూడ అల్లరుజరిగెను. ఆగస్టు ౩౦వ తేది రాత్రి క్లజులో ౩౦౦౦౦ మంది రైతులు గుంపులై ఇటలీ, జర్మనీల రాయబారుల కార్యాలయములకిటికీలను పగులగొట్టిరి.

**నిగ్రహము**

రుమేనియాలో బైసోవులో జర్మనుప్రజలుగలరు. అందుచే అక్కడిఅల్లరిని గూర్చి రుమేనియా ప్రధాననగరమగు బుఖారెస్టులోని జర్మను రాయబారి రుమేనియాప్రభుత్వమును ఆక్షేపించెను. సెప్టెంబరు ౨వ తేదినాటికి రుమేనియా దేశీయాంగమంత్రి హంగరీకి రుమేనియా ఇచ్చుచున్న ప్రదేశములో జాతీయదుఃఖప్రకటనవల్ల అల్లరులు జరుగగలవు కాబట్టి అట్టి దుఃఖప్రకటనలు చేయరాదని ఆజ్ఞగావించెను అయినను క్లజులో జనుల దుఃఖప్రకటనలు సెప్టెంబరు ౩వ తేదినాడు జరుగనే జరిగెను. దీనికివిరుద్ధముగ హంగరీప్రజలును ఆందోళనలనుచేసిరి. అందుపై ౧౦౦మంది హంగరీప్రజలను అరెస్టుచేసి జనులను చెదరగొట్టిరి. క్లజులో టాక్సీలు, బస్సులు నడవలేదు దుకాణములు మూయబడెను. కొందరు హంగేరియనులు సాచుమారేపట్టణములో ప్రవేశించి బ్యాంకులపైబడిరి. ఇదంతయుగాక ట్రాన్సిల్వేనియాలోని కొన్ని రుమేనియా సేనలు అక్కడినుండి లేచిరావనుచున్నవి. ఇపుడురుమేనియా సేనలలో ఒక జనరలును తొలగించినారు మగ్గెరు రాజీనామానిచ్చినారు. మరియొకరు తాను బ్రిటనులో నున్న జనరల్ డీగాల్ గారితో చేరుకొందుననుచు రాజీనామా నిచ్చినారు. ఈఅల్లరులను శాంతింపజేయుటకై రుమేనియాప్రధాని గుర్తుగారు ప్రజలు శాంతముగానుండవలసినదని సెప్టెంబరు ౩వ తేది ఒక విజ్ఞప్తి గావించినారు.

ఆగస్టు ౨౯వ తేదిరాత్రి ట్రాన్సిల్వేనియాలోని రుమేనియాజాతీయ రైతులనాయకుడగు మనియోగారు రుమేనియారాజగు కెరోలుగారితో ఏమి సంభాషించియుండిరోగాని, సెప్టెంబరు ౨వ తేదినాడు వారు బుఖారెస్టునుండి బయలుదేరి క్లజుకు చేరిరి. అక్కడవారుమిత్రులతోకలిసి క్లజుమున్నగుపట్టణాలలో కొన్ని సంఘములనేర్పాటుచేయగలననియు, వాటిపని ట్రాన్సిల్వేనియాలోని రుమేనియనులు హంగరీ పాలనక్రిందికి వచ్చుట కిష్టపడుటలేదని ఆందోళన చేయునట్లు చేయుటయేయనియు చెప్పిరి.

**రుమేనియా సేనల ప్రయాణము**

సెప్టెంబరు౧వ తేదినుండి రుమేనియా సేన ఉత్తరట్రాన్సిల్వేనియానుండి లేచిపోవుటకు ప్రారంభించెను.

## బల్గేరియా వ్యవహారము

బల్గేరియాకు రుమేనియావారు దక్షిణ డోబ్రుజానిచ్చుటకంగీకరించిరి గాని, బల్గేరియావారి తుది సూచనలను రుమేనియావారు సెప్టెంబరు ౩వ తేది వరకు అంగీకరించలేదు. సెప్టెంబరు ౧వ తేది బల్గేరియా రాజు బల్గేరియా విదేశాంగమంత్రితో సంభాషించినతర్వాత, ప్రత్యేక మంత్రివర్గ సమావేశము జరిగెను. బల్గేరియా ప్రతినిధులు సరిహద్దులోనుండు ఎ...పట్టణములో కనుపెట్టుకొనియున్నారు,

**హంగరీలో ఆనందము**

హంగరీ ప్రధానమంత్రి, విదేశాంగమంత్రి వియన్నానుండి తమ ప్రధాననగరానికి ఆగస్టు ౩౦వ తేది రాత్రిచేరినపుడు జనులు తమసంతోషోత్సాహములను ప్రకటించిరి. హంగరీ పతాకముతోపాటు జర్మనీ, ఇటలీ పతాకములుకూడ వీధులలో కట్టబడెను.



## ఫ్రెంచి కాలనీల తిరుగుబాటు

ఆఫ్రికాలో భూమధ్యరేఖకు సమీపముగానుండు ప్రాంతములో చాడ్, గెబాన్, ఉబాంగి, మధ్యకాంగో అనునవి ఫ్రెంచివారికిచెందిన కాలనీలు. వీటిమొత్తము విస్తీర్ణము ౯,౫౯,౨౫౬ చదరపుమైళ్ళు ౩౫ లక్షల జనసంఖ్యగలదు. ఈ కాలనీలలో చాడ్ అనునది ఫ్రాన్సులోపెటైను గారిప్రభుత్వముక్రింద నుండనొల్లననుచు జనరల్ డీగాల్ గారిపక్షమునచేరినట్లుచూచియున్నాము.

కాంగోలోకూడ కొందరు ఫ్రెంచి అధికారులు ఫ్రాన్సులో పెటెయినుగారి ప్రభుత్వమునకు లోబడియుండెదమని చెప్పుచుండిన తమగవర్నరు జనరలును, అడ్మినిస్ట్రేటరును అరెస్టుచేసి బెల్జియంవారికి చెందిన లియోపోల్డు విల్లెకు గొనిపోయిరి. జనరల్ డీగాల్ గారు ప్రత్యేకముగ ఈకాలనీని వశపరచుకొనుటకై పంపిన కల్నల్ డీలార్మినాట్ గారిని గొప్పజనులగుంపు స్వాగతమిచ్చి, ఆగవర్నరు జనరల్ గారిస్థానమునకుదెచ్చెను.

ఈ కాంగో డీగాల్ గారికి లొంగుటవలన బ్రిటీషువారికి అనుకూలమున్నది. నైజీరియానుండి సూడానువరకు బ్రిటీషువారికిపుడు రాకపోకల సౌకర్యము లభించినది. ఇటలీసేనలు దక్షిణము వైపుజొచ్చుకొనిపోవ యత్నించుచో ఎదుర్కొనుటకై అరోడ్రుమెంట విమానాశ్రయములను ఏర్పాటుచేసుకొన వీలగును.

ఇదివరలో జర్మనీక్రిందనుండి గత ఐరోపా మహాసంగ్రామాంతమున ఫ్రెంచివారి రక్షణక్రిందికివచ్చిన కామెరూన్సు అను కాలనీకూడ జనరల్ డీగాల్ గారికి లొంగినది. దానివిస్తీర్ణము ౧౬౬,౪౮౯ చదరపుమైళ్ళు. జనసంఖ్య ౨౫ లక్షలు. దీనిలో ముఖ్యమైనరేవు అగుదువాలావద్ద ౧౦౦౦౦ టన్నులవరకు ఓడల నుంచవచ్చును.

సెప్టెంబరు ౧వ తేదినాటికి ఆఫ్రికాలో భూమధ్యరేఖ సమీపముననుండు ప్రాంతములో ఫ్రెంచివారి కాలనీలకుచెందిన సేనలన్నియు జనరల్ డీగాల్ గారికి లొంగినట్లు ప్రకటనచేయబడినది.

వెస్టుఇండీసులోకూడ ఫ్రెంచివారి కాలనీలగు మార్టినిక్ లోను గ్వాడెలూప్ లోను జనులు, అధికారులుకొందరు ఇపుడుఫ్రాన్సులోని పెటెయిను ప్రభుత్వమునకు లొంగదలచుకొనక అల్లరులు చేయదలచుచున్నారు. ఈకాలనీలో సైనికులయొక్కయు, అధికారులయొక్కయు జీతములుబకాయపడియుండుటమున్నగుఆర్థిక పరిస్థితులచేకలిగినఅసంతృప్తిదీనికితోడగుచున్నవి. కాయెన్నేఅనుకాలనీలోకూడఇట్లేయున్నది.

పెటెయిను ప్రభుత్వమువారు న్యూకాలెడోనియాఅను తమకాలనీయొక్క గవర్నరు తిరుగుబాటుచేయుటచే అతనినితొలగించి కొత్తగవర్నరునునియోగించిరి. అందుపై ఆ కాలనీయొక్క శాసనసభయగు కౌన్సిలుఆగ్రహించి రాజీనామానిచ్చినది. వారలు ఆకాలనీ జనరల్ డీగాల్ గారి క్రిందచేర్చవలెనని కోరుచున్నారు.

## రష్యా రుమేనియాల సంబంధములు

రుమేనియా రష్యాసరిహద్దులలో ఉభయపక్షముల విమానముల సంఘర్షణలనుగూర్చి ఇదివరలో వినియుంటిమి. యిపుడు ఇంకను మరికొన్ని సంఘర్షణల కారణములు కనబడుచున్నవి. ఏ జాతీయులను ఆప్రాంతములోనికి మార్చువిషయమునను, బెసరేబియా, బుకోవినాలను రష్యా సేనలు ఆక్రమించుకొనుటకు పూర్వమే ఆరెండు ప్రాంతాలనుండి రుమేనియావారు తీసికొనిపోయినరోలింగుస్టాకునరష్యావారికివాపసుచేయవలెననుకోరిక విషయములోను వివాదములు తెగకున్నవి.

## ఇటలీ-బ్రిటనుల యుద్ధము

ఆగస్టు ౨౯నుండి సెప్టెంబరు ౨వరకు ఇటలీ సేనలు ఆఫ్రికాలో బ్రిటీషువారితో యుద్ధములో బూనాను ఆక్రమించుకొనినట్లు ఒకవార్తవచ్చినది. ఈసంగతితప్ప తక్కినవన్నియు విమానాలదాడుల సమాచారములే.

దక్షిణాఫ్రికాలో బ్రిటీషువారి విమానములు మొగాడిస్కో రేవులో ఇటలీవా రుంచుకొనియున్న మోటారు శకటములపై ఆగస్టు ౨౯వ తేది విపరీతముగా బాంబులువేయుటవల్ల అనేకందల మోటారులు నష్టమైపోయి యుండుననుకొనుచున్నారు. ఈమొగాడిస్కోరేవు అనునది ఇటలీవారి సోమాలిలాండుయొక్క ముఖ్యపట్టణము. బ్రిటీషువారి విమానాలు ఆగస్టు ౨౯వ తేది ఇటలీవారిదగు తూర్పుఆఫ్రికాలోని టాంకులపైనను, మెసావావద్దఇటలీవారి నౌకానిర్మాణపు వర్కుషాపులమీదను, ఆగస్టు ౩౧వ తేది తూర్పులిబియాలో ఇటలీవారి విమానాశ్రయాల మీదను, ఎల్ ట్మిమి, ఎల్ గుబ్బి, డెర్నా, బాంబా, ఎల్ గాజాలా, బార్డియా—అనుచోట్లపైనను, టోబ్రక్ విమానాశ్రయముమీదను, ఆగస్టు౩౦వ తేది ఇరిట్రియాలోని అగోర్డాటులో ఇటలీవారి స్టోరుల మీదను, సెప్టెంబరు ౧వ తేది ఇరిట్రియాలోని అస్సాబులో ఇటలీవారి సరకులుంచు చోట్లపైనను బాంబులువేసినవి.

ఆగస్టు ౨౯వ తేది ఒకగంటసేపు మాల్టా మీదను, మెర్సామాత్రుమీదను సెప్టెంబరు ౨వ తేది మాల్టామీదను, హైఫామీదను, ఇటలీవారు విమానాలనుండి బాంబులువేసిరి, మాల్టాపై మొదటిదాడిలో అనేకములైన యిండ్లపై బాంబులుపడెను. ఆగస్టు౨౯వ తేది మెర్సామాత్రుపై ఇటలీవిమానములు దాడిచేసినపుడు బ్రిటీషువారు ఒక ఇటలీవిమానము క్రిందకూల్చిరి. ఆగస్టు౩౧వ తేది తూర్పులిబియాలో ఇటలీవారిప్రదేశాలపై బ్రిటీషువిమానాలదాడిలోఆధమపక్షమునాలుగైనను ఇటలీవిమానాలు క్రిందకూల్చబడియుండును, ఆ దేరోజా టోబ్రకుపై ఒకటి, ఎల్ గాజాలాపై ఒకటి ఇటలీవిమానములు బ్రిటీషువారిచే క్రిందకూల్చబడినవి

## ఓడలకు దెబ్బలు

ఆగస్టు ౨౮వ తేది ఐర్లండు పడమటి సముద్రములో 'ఎల్లే' అను ఫిన్లెండు ఓడపై టార్పిడో దెబ్బతీయబడెను. అదిమునిగిపోయెను.

బ్రిటీషువారి వాణిజ్యపు ప్రయాణికుఓడఒకటి ఉత్తర అట్లాంటికు సముద్రములో టార్పిడో ప్రయోగముచే ముంచివేయబడెను. దానిపేరు "డక్కీ గా్ కాజిల్" తూర్పు మధ్యధరాసముద్రంలో బ్రిటీషువారి ఓడనొకదానిని ఇటలీవారు విమానాలనుండి బాంబులువేసి పాడుచేసిరి. "పెంజెన్సు" అను బ్రిటీషు ఓడ టార్పిడో దెబ్బలుతగిలి సముద్రములోమునిగిపోయినది.

కనడాకు ౩౨౦ మంది బిడ్డలను తీసికొనిపోవుచుండిన ఒక బ్రిటీషుఓడపై టార్పిడో దెబ్బపడెను. ఆఓడమునిగిపోయెను. కాని ఆబిడ్డలందరును మునుగకుండా తప్పించుకొనిరి.

# కిరీటభ్రష్టలైన రాణులు

గత ప్రపంచ యుద్ధానంతరం రాజ్యం విడిచి పారిపోయిన మాజీ జర్మన్ చక్రవర్తి కెయిజరు భార్య హెర్మైన్. ఈమె మొదటిభర్త కారోలాత్ రాకుమారుడైన ఫెలిక్స్. అతడు ౧౯౨౦లో చనిపోగా ఈమెతిరిగి కెయిజరు చక్రవర్తిని పెళ్ళాడింది. పెళ్లినాటికి ఈమెకు (వెనుకటి భర్తవలన) అయిదుగురు పిల్లలున్నారు.

స్పెయిన్ దేశపురాణి విక్టోరియా. ఈమె విక్టోరియా మహారాణికి మనుమరాలు. ౧౯౦౬లో స్పెయిన్ రాజు అల్ఫాన్జోను వివాహమాడింది. ఆమె ఆర్గురు పిల్లలలోను యిరువురు మోటారు ప్రమాదంలో చనిపోయారు. ఈమెభర్తతోసహా ౨౫ సంవత్సరాలు రాజ్యంచేసి ఇప్పుడు విడాకులు పుచ్చుకుని ఇంగ్లండులో వుంటూంది.

పోర్చుగల్ రాణి అమీలియా. ప్రపంచచరిత్రలో ఈమెదొక విషాదఘట్టం. ౧౮౬౫లో ఈమే ట్వీకెన్‌హామ్‌లో జన్మించింది ౧౮౮౬లో పోర్చుగల్ రాజును వివాహమాడింది. ౧౯౦౮లో ఈమెభర్తను, కొడుకును లిస్బన్ నగరంలో చంపివేశారు.

ఇప్పుడామె వెర్సేల్సు నగరంలో వుంది.

సయాం దేశపురాణి రంబాబర్నీ. ౧౯౨౫లో సింహాసన మధిష్ఠించిన ప్రజాధిపక్ రాజుభార్య. ప్రజలకూరాజుకు ఎప్పుడూ ఏవోలావాదేవీలు జరుగుతూ వుండేవి. అందుచేత ౧౯౩౫లో అతడు రాజ్యాన్ని త్యజించవలసి వచ్చింది. ఈ రాజదంపతు లిరువురూ ఇప్పుడు ఇంగ్లండులో వుంటున్నారు. వీరు ఆటపాటలతో కాలం వెళ్లబుచ్చుతారు.

అల్బేనియారాణి జెరాల్డీన్. హంగరీలోని బుడాపెస్టు నగరంలో ౧౯౧౫లో జన్మించినది. కౌంటు అపోనీ ఈమెతండ్రి. ఈమె అల్బేనియారాజైన జాగ్‌ను ౧౯౩౮ ఏప్రల్ నెలలో పెళ్ళాడింది. భార్యా భర్త లిరువురూ మహదానందంగా రాజ్యం చేస్తూవుండగా ౧౯౩౯లో ఇటాలియన్లు అల్బేనియాపై దండెత్తారు. పాపం ఈమె అప్పుడే పుట్టినశిశువుతో అర్ధరాత్రివేళ శత్రుసైన్యముల కంటబడకుండా తప్పించుకుని పారిపోవలసి వచ్చింది. ఆ రాజదంపతు లిప్పుడు ఫ్రాన్సు దేశంలో నివర్సేల్సు నగరంలో తలదాచుకొంటున్నారు.

ఆస్ట్రియాకు చక్రవర్తిని. హంగరీకి రాణి అయిన జీతా. ఈమె ౧౮౯౨లో పుట్టినది. తండ్రి ఇటాలియన్ రాకుమారుడైన బోర్‌బన్-పర్మా. ఈమె ౧౯౧౧లో హాప్సుబర్గు రాకుమారుడైన చార్లెస్‌ను వివాహమాడింది. అతర్వాత ఈమెభర్త చక్రవర్తి అయ్యాడు.

అబిసీనియాచక్రవర్తి హెయిలీసెలాసీ భార్య మెనెన్. ఇటాలియన్లు అబిసీనియాపై దండెత్తినప్పుడు ఈమె ౧౬ దినములు ఉపవాసంచేసింది. చివరకుదేశాన్ని శత్రువులకు వప్పగించి వెళ్ళిపోవలసివచ్చింది. ఈమెఇప్పుడు కుటుంబంతో సహా దరిద్రం అనుభవిస్తూ ఇంగ్లండులోని బాత్ నగరంలో వుంటూంది.

ఆఫ్గనిస్తాన్ రాణి సురయ్యా. అమానుల్లాఖాన్‌గారి భార్య. ఆఫ్గనిస్తాన్ విదేశాంగమంత్రియైన మహమ్మద్ జార్జిగారి కుమార్తె. ఈమె ఆఫ్గస్తాన్‌లో పాశ్చాత్యభావాలు ప్రచారంచేద్దామని చూచింది. ప్రజలకు ఇది ఇష్టంలేక కోపించారు. తుదకు ప్రజలు ఈదంపతులను సింహాసనంనుంచి దింపివేశారు. వీరిప్పుడు ఇటలీలో వున్నారు



గ్రీసు రాజుభార్య ఎలిజబెత్. ౧౮౯౪లో ఈమెజననం. రుమేనియారాజైన ఫర్డినాండ్ కూతురు. ఈమె భర్తతో ౧౪ నెలలు కాపురంచేసేసరికి అతడు పదచ్యుతుడయ్యాడు. వారిరువురో విడాకులిచ్చుకున్నారు. తర్వాతమళ్లీ అతడు రాజయ్యాడు. కాని ఇప్పుడు బుఖారెస్టు నగరంలో ఒక కిరాణాదుకాణం పెట్టుకుని కాలక్షేపం చేస్తున్నది.

రుమేనియా దేశపురాణి హెలెన్. జననం ౧౮౯౬. గ్రీసురాజుకాన్స్టాన్‌టైన్ కూతురు. ౧౯౨౧లో రుమేనియాయువరాజు కెరాల్‌ను పెళ్ళాడింది. ఈమెభర్త కొన్నాళ్లకురాజై ౧౯౨౫లో రాజ్యాన్ని త్యజించాడు. తర్వాత అతడు ఫ్రాన్సు వెళ్లి పెనూప్కాతో కొన్నాళ్లువున్నాడు. తర్వాత బుద్ధిమారి మళ్ళీ రాజుగావచ్చాడు. కాని భార్యాభర్తలిరువురూ విడాకులు పుచ్చుకొన్నారు. ఇప్పుడీమె ఇటలీదేశంలోని ఫ్లారెన్సునగరంలో ప్రశాంతజీవనం గడుపుతూంది. ఏడాదికోమారు ఈమె తన కొడుకు రుమేనియా యువరాజు అయిన మైకేల్‌నుచూసి వస్తూవుంటుంది.

(వినోదిని)

# నాగబల

(వే. తి. రామానుజాచార్యులుగారు)

ఈ యోషధిని ఇండియన్ డ్రగ్సునుంచి ౧౯౩౬ సంవత్సరములో ఒకఅప్రాచ్యవైజ్ఞానిక శిఖామణి కనిపెట్టి క్షయలమీదవాడ వచ్చునని తన అభిప్రాయమును ప్రకటించినట్లు ౧ ఆగస్టు తేది బులెటన్‌పత్రికలోగల ఒక చిన్నవ్యాసమును భద్రపరిచి శ్రీసురవరంప్రతాపరెడ్డిగారు నాకు వినిపించిరి. దినదినమును పాశ్చాత్యులు చేయుచున్న విమర్శనఅద్భుతముగానున్నదనిరి. ఈయోషధి ప్రాచీనభారతీయవిజ్ఞానమున కనిపెట్టబడినదనియు ఆయుర్వేదసాంప్రదాయమున ప్రశస్తముగా నాటినుండి నేటివరకును విరివిగా వైద్యులచే వాడబడుచున్నదనియు నేను ప్రమాణవాక్యములతో వారికివినిపించగా, అబ్బురపడి వారీవిషయమును సప్రమాణముగా పత్రికకు వ్రాయుమని కోరిరి. భారతీయవైద్యవిజ్ఞానముయొక్కయు ఓషధిపరిచయముయొక్కయు ప్రాచీనత్వము ననుసరించి వ్యాసమును వ్రాయుచున్నాను.

నాగబల-ఇదిబలాచతుష్టయమని వ్యవహరింపబడుచున్న ఒకఓషధిసముదాయమునకు చేరినమూలిక. ౧ బల-౨-అతిబల-౩-మహాబల-౪-నాగబల-అని యీచతుష్టయము ఆయుర్వేదసాంప్రదాయమున ప్రసిద్ధిచెందియున్నది. యీనాగబలా శబ్దమునకు "నాగానాం-గజానాం-బలకృత్ నాగబలా" ఏనుగులకు బలమునుజేయునది అని సంస్కృతమున అర్థముచేయబడినది. గాంగేరుకీ నాగబలా-ఝుషా-హ్రస్వగవేధుకా- అనునాలుగుపర్యాయపదములతో అమరసింహుడు అమరకోశముయొక్క ద్వితీయకాండలో వనౌషధివర్గమందు ఆనాడు వాడుకలోనున్నట్లువ్రాసినాడు. ఈఅమరసింహుడు నేటికి ౧౫-౧౬వందల సంవత్సరములక్రిందటివాడు. ౧౬ సంవత్సరములకోలము నాటివాడగు రాజాధిరాజశ్రీ సుదనపాలనృపతి ౧౫౩౦ విక్రమశకంలో తన మదనపాల నిఘంటువందు అభయాదివర్గములో పర్యాయపదసంఘములతో నీయోషధిని నాటికాలమున వాడుకలోనున్నట్లువ్రాసినాడు. ౧౨౦౦ శాలివాహనశకమువాడగు సోమగవంశజుడైన శ్రీ వీరసింహన్పపు నేటికియేడువందల సంవత్సరముల క్రిందట వీరసింహావలోకమను తన వైద్యగ్రంథమున క్షయప్రకరణములో 'క్షీరేణవా నాగబలాప్రయోగం' నాగబలను పాలతోనైనను ప్రయోగించవలయును అనివ్రాసినాడు. యీతడు చికిత్సలనన్నిటిని అనుభవముగాచేసినట్లు ఈతని గ్రంధప్రమాణమున స్పష్టమగును. క్రీస్తుపూర్వమువాడగు సుశ్రుతసంహితాకారుని గురువైన కాశీరాజు ధన్వంతరియను బిరుదముగల దివోదాసు, తనధన్వంతరినిఘంటులో గుడూచ్యాదివర్గమున నూటముప్పదిలో మూడవదిగా యీయోషధిని పదహారుపర్యాయపదములతో అనేకఉపయోగములందు వ్రాసినాడు. నేటికితనికాలము మూడునాలుగువేలసంవత్సరములు. వీరందరికిని ప్రాచీనుడును సకలతంత్రకోవిదుడును అగు చరకుడు. తనచే సంస్కరింపబడిన అగ్నివేశతంత్రము "చరకమని ప్రసిద్ధిగల ఆయుర్వేదగ్రంథమునందు రసాయనప్రకరణమున దీనియొక్క శక్తి అమోఘముగా వ్యాధులను రుదుర్పుట యందేగాక మానవుని దీర్ఘజీవితునిగా జేయునని ప్రయోగవిధానమును వ్రాసినాడు చరకసంహితాకాలము నేటికి రమారమి అయిదారువేల సంవత్సరములని చారిత్రకులచే వూహింపబడుచున్నది. యిట్లుభారతీయఆరోగ్యవిజ్ఞానవిశారదులగు ప్రాచీన ఆర్యాచార్యులు యీమూలికనుగురించి విపుల్చిన విషయములను పరంపరగా నేమందలివారికి తెలియుటకై సంహితలయందు స్పష్టముగా వ్రాసియున్నారు. గురుశిష్యపరంపరగను వంశపారంపరగను యీయోషధిని సామాన్యులు మొదలు మహాపండితులవరకుగల ఆయుర్వేదవైద్యులు నేటివరకును వాడుచున్నారు యిందుమూలముగ నేడు పాశ్చాత్యులు కనిపెట్టిన ప్రాచీనతగాని నూతనతగాని భారతీయ విజ్ఞానవిమర్శకులకువారికి క్రొత్తగాగాని వింతగాగాని గనుపట్టదు.

నాగబలా ప్రయోగములు

ఇదిమధురరసము శీతవీర్యముగలది. దీని సమూలకషాయము లేక వేర్లయొక్కపొట్టును చూర్ణించిగాని ఉపయోగింతురు. సువాసనగానుండును త్రిదోషములయందలిపరస్పరవృద్ధి క్షయములనుతొలగించి సమత్వమునకు తెచ్చును. బలమునిచ్చును వీర్యమును శుభ్రపరచును, వృద్ధిని చేయును, రక్తపిత్తము [ఊర్ధ్వగతమైనను అధోగతమైననుకూడా, నివర్తింపచేయును. వాతవ్యాధి క్షయ, దుర్బలము యీవ్యాధులయందుముఖ్యముగావాడబడుచున్నది. బాగాపనిచేయుచున్నది. "బల్యానాగబలావృష్యా" నాగబలమునువృష్యమునుగలదిఅనుటచే బలకరమగు అన్నిరకముల లేహములయందును యిదివుపయోగించబడును పుంస్త్వమును వృద్ధిచేయును. యీయోషధిని చరకమహర్షి యితరచికిత్సలన్నిటికంటెనూ క్షయయందును, వాతవ్యాధులయందును విశేషముగా వాడుకచేసినాడు. యింతేగాక ప్రత్యేకముగా రసాయనమున ప్రకరణమున దీనినివాడినాడు "యజ్జరావ్యాధివిధ్వంసిభేషజంతద్రసాయనం" యేఔషధమువ్యాధినిపోగొట్టి ముసలితనమురాకుండాకాపాడునో [అనగా ముసలితనపు చిహ్నములు రాకుండానివిభాగము] అట్టిదెరసాయనమని అనబడును. నాగబలా మూలాన్యుద్ధరేత్, తేషాం సుప్రక్షాళితానాంత్వక్పిండం, అమ్రమాత్రంవా శ్లక్ష్ణపిష్టమాలోడ్యపయసా ప్రాతఃప్రయోజయేత్-చూర్ణీకృతానివాపయసాపిబేత్- మధుసర్పిర్భ్యాంవాసం యోజ్యభక్షయేత్-జీర్ణేచ క్షీరసర్పిర్భ్యాంశాలిషష్టికమశ్నీయాత్ అస్యప్రయోగాత్ వర్షశతమజరంవయస్తిష్ఠతి' మంచిసమయమున నాగబలావేర్లనుగ్రహించి, వేళ్ళపొట్టునుతులంగాని నాలుగుతులాలుగాని మెత్తగానూరి పాలలోకలిపిగాని తేనె నెయ్యి కలిపిగాని తినవలయును చక్కగా ఔషధముజీర్ణించి ఆకలియగునపుడు నెయ్యిపాలుకలుపుకుని అరువదిదినములకు పండు వడ్లబియ్యమును అన్నంవండుకొని తినవలయును. ఇది ప్రయోగవిధానము, పత్యమును యిందువల్లనూరుసంవత్సరములు నిరోగిగా దృఢముగా ముసలితనములేకజీవించును. ప్రయోగకాలము వయస్సునుబట్టియు వ్యాధినిబట్టియు వైద్యుని యిష్టానుసారము నిర్ణయించవలయును. యితనితరువాత వారందరును యీయోషధిని యిట్లేవాడుచువచ్చిరిగాని యింకనువిస్తరించినపత్రికలకు స్థలమొసంగుటకష్టమని విరమించినాను. ప్రస్తుతము యీయోషధినిజిబిలికయనిచెన్న రాజధానియందును. నెయుంతచెట్టు, లంజపుట్నాలచెట్టు అని నైజాంఆంధ్రప్రాంతములయందును వాడుచున్నారు. విజ్ఞులుగ్రహించెదరనియు కాదెదరనియునమ్ముచున్నాను.

## ముత్యాలమ్మకు ఆముదం తోట బలి

కంచపల్లి. (నల్లగొండ తాలూకా), మెహరు ౨౩

అప్పుడే సూర్యుడు మాయమయ్యాడు. గ్రామపడచులంతా అలంకారభూషితలై బయల్దేరుతున్నారు. వారితలలపైని కడవలకు బాగుగా అమర్చబడిన పసుపుకుంకుమబొట్లు, వాటి మూతలలో కండ్లుమిరుమిట్లుగొలిపే మినుకుమినుకుమని వెలుగుతున్న దీపాలవారిదిఒకజట్టు. యమదూతలనుతప్పించుకొని మళ్ళీ కొన్నాళ్లు బ్రతికిఉందామాఅని యత్నించుచున్న ప్రాణిలాగా, బ్రతికేఉందామని అటుఇటు ఉరుకులాడె గొర్రె మేకపోతులనుసాధిస్తున్న చాకలివాళ్ళ దొర గుంపు సున్న ముజాలలతో, శృంగారించబడినఎద్దుల మెడలపై కొణలతో వారి.ఎల్లాంద్ర మేటిచీరలు తమపైకప్పించుకొని బయల్దేరుతున్న రథాల్లాగా బండ్లు, ఊళ్ళో పోతరాజు మొదలుకొని దేవుళ్ళ అందరిముట్లు. ధ-ధ-ధ-అని. ఊరేగించటం మొదలెట్టారు వాటియజమానులు. మిగిలిపోయింది ముత్యాలమ్మ. అయమనివాసం ఊరివెనక ఓబీడపైరతు ఆముదముచేలో, రానేవచ్చాయి బండ్లు యుద్ధంలోకి రథాలుబయల్దేరింలాగా.

ఈవచ్చేజంతువుల్లాంటి జనసమూహాన్ని చూచి రైతుగుండెబద్దలైపోతోంది. జీతగాన్ని వెంబడించి తోటకాపలాకి వెళ్ళాడు.

అంతట్లో ఓఇద్దరు పురుషార్థులు జీతగాన్ని ఎదిరించారు ఒకరు గ్రామాధికారిసోదరుడు. పేరు..............వయస్సు పాతిక సంవత్సరాలుంటై. ఏట్లనిమనిషి "పోనివ్వరా" అని గదిలో సింహంలాగ గర్జించటంమొదలుపెట్టాడు. జీతగాడుఎదురీతాడు "వలదయ్యా" అని "నీతె క్కోం ఇదిపాడుచెయ్యకపోతే నేనుమొగాణ్ణా" అన్నట్లు బోధపడింది వారి మనోభావం. వీరికి తోడు..................వీ రు ముత్యాలమ్మ తల్లికి పరమభక్తుల్లా కన్పించారు. ఆ "గణాల" పూనుకొన్నవాళ్ళలో లేక రానీ కోవాలంటె అప్పటిసమయంలో వీరికికూడ తన్మయానందమైనటువంటిది ఒ "గణం" నిండుకొనేఉంది. అది ముత్యాలమ్మయందుగల భక్తి ప్రభావమేఅనుకుంటాను. కొనకివీరు ఆ "వడ్డ" ని మొత్తుకుంటున్న జీతగానిపై లాటీప్రయోగం చేశారు తోటధ్వంసంచేసి రథాలుఊరికించారీకూరులు లేకున్న "మొక్కు-చెల్లించనోళ్ళమైతాము" ని వాడుమొత్తుకుంటె "సాక్ష్యం తెమ్మనది ట వారిఖానూన్.

గ్రామాధికారి ఈమహాఉత్సవంలో పాల్గొనికూడ ఎందుకు ఈ విషయం "తెలియ లేదన్న" ట్లు అయిపోయ్యాడో బోధపడడంలేదు.

—

## ఆర్యసమాజస్థాపన

(విలేఖరి) పర్యాల. మెహరు ౨౮

విక్రమసంవత్సర శ్రావణబహుళ అష్టమి ఆదివారమురోజున ప్రచారకులగు పండిత కేశవశాస్త్రిగారు పర్యాలగ్రామమునకు దయచేసి, ఆర్యసమాజమును స్థాపించిరి. కార్యనిర్వాహణమునకై దిగువవారు యెన్నుకోబడిరి:—

ప్రధానులు: శ్రీగార్లపాటి రాఘవరెడ్డిగారు, తిరుమలగిరి (తా॥ పర్యాల)

మంత్రి: కటంగూరు కేశవరెడ్డిగారు, పర్యాల

ఉపమంత్రి: శ్రీకొత్తగట్టు సుందరరావుగారు, పర్యాల

కోశాధ్యక్షులు: శ్రీసూరఆనందరావుగారు నరసక్కపల్లి (తా॥ పర్యాల)

సమాజము కటంగూరు కేశవరెడ్డిగారి స్వంత గృహములో నెలకొల్పబడినది.

—

## భజనమండలి

పెద్దెముల్, మెహరు ౨

ఈగ్రామం చించోలిలోచేరినది. పూర్వం యీగ్రామంలో ప్రతిబుధవారము అంగడి జరుగుచుండెను. ఏమికారణముచేతనో ఆగిపోయినది. దీనినుండి వ్యాపారస్థులకు వుద్యోగులకు పల్లెటూరి బీదజనులకుచాలకష్టము జరుగుచున్నది. అమ్మవలెనంటే కొనవలెనం టేతొమ్మిదిమైళ్ళు తాండూరుకు వెళ్ళవలసివస్తుంది.

ఇదివరకుప్రతిఏకాదశివ్రతముభజనలవండంగా శ్రీపాండురంగస్వామిదేవాలయములో జరుగుచున్నది. ఆషాఢశు॥౧౧ నాటినుండి భజన హరికథ జరిగి ఆషాఢబ॥౧౧ దు శ్రీ పాండురంగస్వామి పాలకిసేవ భజనతో గోపాలరావు పట్వారిగారి అధ్యక్షతక్రింద ప్రతిసంవత్సర ప్రకారం తీయబడెను. జోనగాము, మారేపల్లిగ్రామాలనుండి భజనమండలీలు పాల్గొనియుండెను. హరికథ తదుపరి భోజనతాంబూలాదులు స్వీకరించి జనులు వెడలిపోయిరి.

ఇక్కడినుండి ౧½మైలుపైన జోనగ్రామం గలదు, అక్కడ యెల్ రెడ్డి పటేలుగారు తన స్వంతవ్యయముతో శ్రీ పాండురంగస్వామి వారి దేవాలయము కట్టించుచున్నారు. ఇంకా పనిముగియలేదు.

ఇట్లు
శంకర్ మోహన్‌లాల్

—



## భువనగిరి గ్రంథాలయస్థాపన

పైశీర్షికతో గోలకొండపత్రికలో వెలువడిన వార్తయందు భువనగిరి గ్రంథాలయ కార్యదర్శికి గ్రంథాలయముచేఏవో చిక్కులు కలిగినట్లు తద్గ్రంథాలయమునకధ్యక్షులైనవారే తెల్పినట్లు ప్రకటింపబడియుండెను. అదిసత్యమైనదికాదు: అంతేగాక ఇతరగ్రంథాలయములవారినికూడ సంశయములపాలుజేయువది గానున్నది. కాన సంశయనివృత్తికొరకు భువనగిరిగ్రంథాలయ పూర్వకార్యదర్శినగు నేను గ్రంథాలయముచే నాకట్టిచిక్కులుకలుగలేదని తెల్పుకొనుచున్నాను. గ్రంథాలయమునకుగూడ పోలీసువారితో నెన్నడును యేమాత్రముచిక్కులుగలుగలేదు. గ్రంథాలయము మూయబడుటకుకారణము గ్రామస్థులలో విద్యాభిమానము లేకుండుటయేకాని వేరుగాదు. ముఖ్యముగా ధనవంతులును పెద్దమనుష్యులును అధ్యక్షులవంటివారునుగూడ చందాలివ్వకుండినయెట్లు నడువగల్గును? గ్రంథాలయమునందుజరుపబడు ఉత్సవములకుగాని వార్షికోత్సవములవంటి ముఖ్యమైనసభలకుగాని అధ్యక్షులవంటిముఖ్యులే దయచేయకుండిన అట్టిగ్రంథాలయ మెట్లునిలువగల్గును? ఇట్టిపెద్దమనుష్యుల ఆదరణలేమియు,ఆర్థికసంబంధమైన చిక్కులునుదప్ప వేరే ఎట్టిచిక్కులును ఎన్నడునుకలుగ లేదు.

గంజులోనియువకులు తనును అమీన్‌గారు పుస్తకములపట్టిక తీసుకొని కచేరికి రమ్మనినప్పుడు అంతగా సంశయపడక వెళ్లుటయే సమంజసమైయుండెను. ఆపట్టికలో నిషిద్ధగ్రంథములులేకుండపరిశీలించుటకే వారుపిలచియుందురు. కచేరీలో నేమూర్ఖుండ బెట్టుదురని బెదరించిన స్నేహితుడు మంచిమనస్సుతో సలహానివ్వలేదనితోచుచున్నది. అమీన్‌గారు చాలమంచివారనియే వినుచున్నాము ఇకనైనయువకులు వారివద్దకి తిరుపుస్తకములపట్టిని తీసుక వెళ్లివారిసలహా ననుసరించి గ్రంథాలయము నడుపుకొనుట చాలమంచిది.

ఈవిషయములో పెద్దమనుష్యులకు శ్రమయిచ్చుట అనవసరము. వారలీవరకే అనేకచందాల క్రింద మామూళ్లక్రిందనలిగిపోవుచున్నారు. ఈ ఇట్టిప్రజాహితసంస్థలకుగూడ సహాయము చేయవలయునన్న వారిని అడిగకొజాలదు. అట్టివారినిగలహాగోరినను యేమిగాదా నెత్తినబకునను భయముతో ప్రభుత్వమువారితో చిక్కులదగులునేమో, లేక పోలీసువారు పేస్తనోటుచేసుకొందురనియో ఏమేమో బెదరులుపెట్టి ఉత్సాహములచంపివేతురు.

విద్యాభివృద్ధికొరకు కోట్లుకొలది ద్రవ్యమును కర్చుపెట్టుచున్న మనప్రభుత్వము ప్రజలుతమ విద్యాభివృద్ధికొరకు గ్రంథాలయముల స్థాపించుకొనుట నాటంకపెట్టదు. గ్రంథములపట్టికతెమ్మనియో ఎలాంటిపత్రికలువచ్చుచున్నవనియో సభలయందెట్టివిషయములు చర్చింపబడుననియో తెలిసికొనుటకు తమవిధిననుసరించి పోలీసు ఉద్యోగులు నాలుగుసార్లుకి చేరికిపిలిపించవచ్చును. దానిచే యువకులకు మంచియనుభవమే పెంపగును గాని వేరేమియు నష్టములేదు. అమాత్రమునకే వేసటపడిఉద్దేశములమానుకొనుట ధీరలక్షణముకాజాలదు.

ఇట్లు
ఉత్పల వెంకటరావు,
భువనగిరి ఆంధ్రభాషానిలయ పూర్వకార్యదర్శి







## సెంట్రల్ బ్యాంక్ ఆఫ్ యిండియా లిమిటెడ్.

1946 సంవత్సరపు 3 o/o డిఫెన్సు బాండ్లు కొనువారికై సెంట్రల్ బ్యాంకువారి ప్రత్యేకస్కీం.

(1) సెంట్రల్ బ్యాంకు ఆఫ్ ఇండియా లిమిటెడ్‌వారు 1946 సంవత్సరపు 3o/o డిఫెన్సు బాండ్లు ప్రకటింపబడిన రేటుప్రకారము యిత్తురు.

(2) బాండ్లకొరకు దరఖాస్తుచేయువారు తాముబాండ్లుకోరిన మొత్తములో ప్రతి 5 శాతము ముందుగా చెల్లింపవలయును రూ. 100 లకు అంతకుపైనగాని దరఖాస్తులు తీసికొనబడును.

(3) తరువాత బాండ్లమొత్తము యీక్రిందివిధముగా చెల్లింపవలయును మొదటి మూడు నెలవరకు ప్రతిశతి 5 గాని ఆ తకెక్కువగాని చెల్లింపవలయును. మిగతమొత్తము దరఖాస్తుచేసిన తేదినుండి రెండుసంవత్సరములలోగా కొన్నవారి సౌకర్యాను సారముచెల్లింపవలయును.

(4) బాండు విలువనుపూర్తిచేయుటకై చెల్లింపబడిన కిస్తుమొత్తములపై బ్యాంకువారు నూటికి 2 1/2 వంతున వడ్డీయిచ్చెదరు.

(5) పూర్తిమొత్తము చెల్లించిన తరువాతి బాండ్లుయివ్వబడును.

(6) బాండుమొత్తముపూర్తిగా చెల్లించినతరువాత ప్రతిశత 2 1/2 వడ్డీఆగిపోయి, బాండు యివ్వబడినతేదినుండి సరియైనవడ్డీ చెల్లింపబడును

(7) బాండుయొక్క పూర్తిమొత్తమును చెల్లించకముందే అమ్మదలచినయెడల బ్యాంకువారు దానిని మార్కెటురేటుప్రకారము ఏ యుక్తిమూషన్ లేకుండచేయిచ్చి దానిపైయింకా చెల్లించవలసినపైకమును పట్టుకొని మిగతపైకము నిత్తురు

హైదరాబాదు-దక్కన్ } 28—8—40

కె. జె. వికాజీ, మేనేజరు.

## గ్రంథాలయస్థితి

(ఒ. వి.)

రాయపర్తి (తా॥ వరంగల్), ౨౭-౧౧-౪౯ ఇచ్చట శ్రీ ప్రమాదిసం॥ర ఆశ్వీజబ॥ ౩ రోజున శ్రీసీతారామచంద్రాంధ్ర గ్రంథాలయస్థాపనము పాఠకమహాశయు లెరిగియుందురు అది రెండుమూడుమాసములు నిరాటంకముగా కొంతయో అభివృద్ధిజెంది ఆంధ్రుల ఆరంభశూరత్వమను అరోక్తిని సార్థకపరచుకొని పతనమొందినదనుటలో సందేహములేదు. ఇందులకు కారణము లనేకములు

దీనికి కార్యకర్తలు (అధ్యక్ష, ఉపాధ్యక్ష, కార్యదర్శి), గ్రామాధికారులగు శ్రీయుతులు, కు॥ నారసింహారెడ్డి, తిరుమల రంగాచారి, అకుల నర్సయ్యగార్లగుటచే ప్రభుత్వమునుండి వారు పొందిన గద్దింపులకు వెరచి తప్పుత్రోవను జూచుకొనిరి. ఈమధ్యలో ఇచట పోలీసుపటేలు గారికిని పదవినీ డిపోవుగతికూడపట్టెను.

దీనికొంత మూలధనముకూడ సుమారు ౨౦౦ రూపాయిలు ఇచ్చునటుల స్థాపనదినమున అభిమానులు వాగ్దత్తముచేసి, కొందరు సుమారు ౭౦ రూపాయిలు నగదు యిచ్చినటుల నిస్సందేహముగా గోచరించుచున్నది. ఈడబ్బునుండి తెచ్చిన బీరువా పరికరములను, మరియు కొనితసరుకులును, మిగిలిన నగదురొక్కమును కార్యదర్శియగు నర్సయ్యగారివద్ద నేయుండెను. కానిఇప్పుడవి వారిఇష్టానుసారము స్వంతకార్యములలోవాడుకొనబడుచున్నవి, దీనిద్వార మాచింతను వెల్లడించుచు గ్రంథాలయపునరుద్ధరణకై ప్రయత్నించుమనటుల ప్రార్థించుచున్నాను

---

చింతబరిగెల గిర్దావర్

పెద్దపేట (లక్సెటిపేటతా॥), ౨౭ మెహార్

ఈగ్రామంలో ఒకపెద్ద చెరువుకలదు. దీనిక్రింద ౯౫౦ ఎకరాలకుపైగా భూమి సేద్యంలో వున్నది యీసంవత్సరం అతివర్షాలవలన చేరేపైరులన్నీ చెడిపోయినప్పటికి తరిసేద్యంమాత్రం పూర్తిఅయినది ఈచెరువునకొన్ని సంవత్సరాలనుండి ప్రతిసంవత్సరం యేదోకొన్నివేల మరమ్మతులుఅప్పాషీవారుచేయుచుందురు కాని ఇప్పటికి అదిపూర్తిగా బాగైనటుల కాన్పింపదు, ఈసంవత్సరంకూడ కొన్నిదినాలక్రిందనే కొంత మరమ్మతుజరిగినది. అయినప్పటికి ప్రతిసంవత్సరంవున్నటుల ఇప్పటికి ఒకటిరెండు చిన్నచేడెలున్నవి.

ఈపట్టికి క్రొత్తగా ఒకగిర్దావరుగారువచ్చినారు. వీరు యిదివరలోమాదిరి అత్యవసరసమ్మతికై షెక్‌వాసియైనమంజూరి తెప్పించినవారుకారు ఒకనిమిషమైన తీరికలేకుండ పద్దుకొక నాగలికట్టుచున్న సమయంలో రైతులే ఖర్చుభరించవలెనని చెప్పుచు చెరువునుండి బొట్టునీరైన వెళ్ళకుండ తూములుమూయించినారు. అలకినపొలాలు ఎండుటకువచ్చినవి. పటేలుపట్వారీలనడిగితే మేమేమి చేయగలమందురు, గిర్దావరునుఅడిగితే చింతబరిగెలు చూపించుతారు. ఈగిర్దావరుగారికి చింతబరిగెలంటె ఎక్కువప్రీతి. పాలు పెరుగు, చేపలు, తీసుకరమ్మని బీదలకు యీచింతబరిగెల చూపుచుందురు.

పైఅధికారులీచింతబరిగెల గిర్దావరునుండి ఈబీదప్రజలను ఎంతత్వరగా విముక్తిచేసిన అంతధన్యులము. యీతాలూకాలో బహుశ్రద్ధతో రైతుకష్టాల నివారించుచున్న తహసీలుదారుగారైన శ్రద్ధతీసికోగలరని నమ్ముచున్నాము,

ఇట్లు

ఒక పల్లెటూరు రైతు

## వైశ్యస్త్రీ పునర్వివాహము

(స్వ.వి.) తిరుమలగిరిబజారు, ఆగస్టు ౩౧

విక్రమ సం॥ శ్రావణ బ॥ ౧౦ బుధవారం ౨౭-౮-౪౦ సాయంత్రం౯-౧౫ంటలకు, తిరుమలగిరిబజారులో ఆర్యవైశ్య యువజనసంఘమువారి యాజమాన్యమున సంఘాధ్యక్షులగు శ్రీయుత మంచికంటివీరయ్యగుప్తగారిగృహమువద్ద, శ్రీయుత వాసుదేవ మొదల్యారు, శ్రీయుత పండిత లక్ష్మయ్యగార్లు, (సికింద్రాబాద్) శ్రీయుత గోదబాలకిషన్ శ్రీయుత డాక్టర్ సి.ఆర్. రామకృష్ణారెడ్డిగార్ల పౌరోహిత్యమున శీలాశంకరయ్య (దేవరకొండ- నల్‌గొండజిల్లా) గారికిని (పెండ్లికొడుకు) పెద్ది వెంకటరాజమణీదేవి (మడికొండ- వరంగల్ జిల్లా)గారికిని పెండ్లికూతురు( వివాహము, వేదోక్తహోమముతో (అనగాఅగ్నిసాక్షిగ) వైదికపద్ధతిపైన అతివైభవముగా జరిగినది.

## శ్రీకృష్ణ జయంతి

(ఒక విలేఖరి) భువనగిరి, మొహారు ౨౮

గత శ్రావణ బ॥ ౮ సోమవారం శ్రీకృష్ణ జయంతి జరుపబడి ఊరేగింపు తీయబడెను. డి. అంజయ్యగారి దళాధిపత్యమున యూనిఫారంతోనున్న వాలంటియరుదళము [ఇందలిబహుసంఖ్యాకులు వంజరియువకులే] మంచినేర్పుతో పనిచేసిరి. ధర్మగీతలోని కీర్తనలను శ్రీయుత ఎని శెట్టివీరయ్యగారు చెప్పుచుండ, యువకులఉత్సాహము మిన్నుముట్టుచుండెను. కొందరు ఆర్యధర్మ కక్షియులిరి. వెంటనే అమీన్ గారు వచ్చి 'ఆర్య' అనుమాటఉంటె చాలాన్ చేయుదుమనిబెదరించిరి వారికి 'ఆర్య'శబ్దముపై ఇంతపట్టుదల యెందుకో? మొత్తముపైన ఊరేగింపు జయప్రదము గాముగిసెను. సేవకొరకై ప్రయత్నించిన శే. నరసయ్య, డి. చంద్రయ్యగార్లు ప్రశంసనీయులు.

SAHARA
ONLY GENUINE WITH THIS
TRADE MARK
CHEAP
MADE IN U.S.A.
SAHARA
CHEAP
5 అణాలకు 10

# ఉస్మానియా పూర్వవిద్యార్థుల మహాసభ

## ప్రభుత్వప్రకటననుగురించి తీర్మానము

హైదరాబాదు మెహర్ ౨౬. గతశుక్రవారము ౨౪ మెహరునాడు హైదరాబాదునగరములో జరిగినపై మహాసభలో ఉస్మానియావిద్యార్థుల అల్లరినిగురించి యీక్రింది విధమైనతీర్మానాలు కావించినారు.

౧

ప్రభుత్వమువారు ఇటీవల విద్యార్థులపైజరిగిన అంశాలనుగురించి కావించినప్రకటనను చూడగా బయటికిచూచేదానికి నిష్పక్షపాతముగా ప్రకటించినారని అనునట్లుగాచేసినారు. కాని తుదిలో అదిఒకపక్షం వహించినట్లే స్ఫురించుచున్నది. ఒకప్రక్క పోలీసువారిమాటలను నమ్మి రుజువైనట్లుగాను ఇంకొకదిక్కు విద్యార్థులమాటలుఅనుమానమైనవిగా నుండునట్లును ప్రకటించినారు. నవాబు బహద్దర్ యార్జంగు గారి వంటి ప్రభావముకలవారి మాటలనుకూడా లెక్కపెట్టలేదనివ్రాసినారు. ఏఅధికారిపేరున్ను తీసుకొనక నవాబు బహద్దరుయార్జంగుగారిపేరును తీసుకొనుట అర్థవంతము గానున్నది. అట్టివారిని విద్యార్థులకువిరుద్ధముగా సాక్షిగాని ఎపుడును ఈసభవారు చాలావిచారమును వెలిబుచ్చుచున్నారు. యదార్థముగ నవాబుగారితో విద్యార్థులు తమసమస్యను తామేపరిష్కరించుకొందురనియు అనవసరంగా ఇది హిందూముస్లింసమస్యలోనికి దిగకుండా చూడవలెననియు తెలుపుకొనిరి. తమలో భేదాలేర్పడి న్యాయమునుసంపాదించుకొనుటలో కష్టముకలుగకుండా చూచుకోవలసి యున్నదనియు తెలిపిరి.

ప్రకటనలో విద్యాపీఠకులపతి (ఛాన్సలర్) గారినుండి ఒకఉద్యోగివిద్యార్థులతోకలిసి కులపతిగారు అస్వస్థతగా నున్నందున మీలోకొందరిప్రతినిధులనుపంపండి అనికోరిరనియు కాని విద్యార్థులు వినలేదనియు తెలిపినారు. ఆదేభోరణిలో దానివెంటనే మరియిట్లుప్రకటించినారు. "కులపతిగారి యింటిసమీపంలో పోలీసులు విద్యార్థులను అడ్డగించిరి. కాని వీరువారిని త్రోసికొనివెళ్లిరి. వారిని విద్యార్థులు రాళ్ళతోకూడాకొట్టిరి"

ఈవార్తల సారాంశాన్ని ఈమహాసభ ఒప్పుకొనుటకుసిద్ధముగాలేదు. ఈవార్తలసంబంధంకులపతితో ఏమిన్నీలేదు. కులపతిగారు విద్యార్థుల దయతో సానుభూతితో కలిసి ఉన్న పరిస్థితివశములోనికివచ్చెను.

ఇదంతయు ప్రకటనలో తప్పుడువిధంగా ప్రకటించుటవలనతప్పుఅభిప్రాయము కలుగుచున్నది. లాఠీచార్జివిషయంలో పోలీసుల అమాయకత్వమును చూపించినారు. విద్యార్థులు నూకగానే వారుప్రక్కకుపోయిరట అయితే విద్యార్థులు నూకినంతనే ప్రక్కకుతప్పుకొనిపోయిన పోలీసులపై మరల రాళ్లురువ్వవలసినశ్రమ విద్యార్థుల కెందుకుగలిగెను! పోలీసువద్ద చిన్నపోలో దెబ్బలుండెనుట అబద్ధం. దీనికొప్పుకొన్నను లాఠీచార్జిఅయిందనియు అయితే అది మెత్తమెత్తగా అయిందనిన్ని చెప్పవలసివచ్చును. దీనికివిరుద్ధంగా లాఠీచార్జిఅయినట్లు దానికి కారణమేదీలేనట్లును పోలీసువార్తలు నటుల వారికధికారంలేనట్లును కావలసినంత దౌర్జన్యమున్నది. లాఠీచార్జి అట్లుండనిచ్చినప్పటికిన్నీ అది మునుగనుట్టుకే యీపోలీసులక్కున్యాయశాస్త్ర ప్రకారం అధికారంలేదు. కావునపోలీసువారు న్యాయశాస్త్రవిరుద్ధముగా ఆచరించినారు. మరియు దౌర్జన్యంచేసినారు.

ప్రకటనతుదిలో ఒకవిచారణసంఘాన్ని నియమించుతునన్వ్రాసినారు. అయితే యీకమిటీ అస్సలువిషయానికికాదట. విచారణాంశాలు ఏవేవో నిర్ణయించేదానికే యీశ్రమను వారులోనగుచున్నారట. దీనివలన విద్యార్థులను ఒకపక్షంవారుగా నిర్ణయమగుచున్నారు. ప్రపంచంలో ఎక్కడకూడా విద్యార్థులను ఒకపార్టీగా పెట్టుటచూడలేదు. ఇదెట్లుండంటే కొడుకున్నూ నౌకరున్నూ కొట్లాటజరిగితే తండ్రికొడుకునుకూడా ఒకపక్షంవానినిగానిలిపి విచారించినట్లుంది.

విద్యార్థులు విద్యాపీఠ ఛాన్సలర్ గారియొక్కయు ప్రభుత్వముయొక్కయుపిల్లలు మరిఅధికారులో నౌకరులైయున్నారు. నౌకర్లచర్యలనుమాత్రమే విచారించవలెను. కమిటీ అట్టివిచారణనే చేయుననియు అట్టికమిటీలో ప్రభుత్వేతరసభ్యులున్నచో వారుఈ ప్రాతవిద్యార్థిసంఘమువారికి నమ్మకముకలవారు గానుండవలెను.

ప్రభుత్వప్రకటన సూర్ణకోలం తప్పుడువ్రాతలయొక్క వలయైయున్నది. అమాయకస్వభావముకల ప్రధానమంత్రిగారిపై ప్రభావము వేయునట్టిదైయున్నది. కావున అట్టిప్రకటనను ఉపసంహరించుకొనవలెనని ఈమహాసభవారు కోరుచున్నారు

### తీర్మానం ౨

ఉస్మానియా విద్యాపీఠ విద్యార్థుల కష్టాలు ఖండించగా రైల్వేహద్దులలో ప్రారంభమైనవి రైల్వేలైను వైశాల్యముపై "మనకు" అధికారముండియుండినట్లయితే విద్యార్థులను అవమానపరచుటకెవ్వరును ధైర్యము చేయజాలకుండిరని ఈసభవారి ఖండితాభిప్రాయము. మనసొంత రైల్వేలైనుమీదను మనషలాకా రైల్వేస్టేషనులద్వారా వేరేరైలైను పోవుచుండుట ఈ సభవారికి వ్యసనముకలిగించుచున్నది. ఈలైను మనఅధికారంలోలేకుండా రైల్వేబోర్డు ఇంగ్లిస్థానులో నున్నది. ఈదక్కనీరాజ్యం సర్వతంత్ర స్వతంత్రరాష్ట్రంఅనేది జ్ఞాపకముంచుకోవలెను. ఈవారంలోనే యీస్వాతంత్ర్యస్మారకోత్సవమును చేయుచున్నాము. అట్టిచో మనసొంత రైల్వేలైనుమీదను మనస్టేషనులమీదను మనకు అధికారము లేకుండుటను ఈసభవారు చాల గర్హించుచున్నారు. ముఖ్యముగా తిరువాన్కూరువంటి చిన్నసంస్థానాలలో తమ రైల్వేలైనుపై తమకుఅధికారముండగా మనకులేకుండుట గర్హింపదగినది

### తీర్మానం 3

ఉస్మానియావిద్యాపీఠ విద్యార్థులపై రైల్వేవారును, పోలీసువారును కావించిన అపచారమున్ను కులపతిగారి బంగ్లాసమీపంలో జిల్లాపోలీసువారు కలిగించిన దౌర్జన్యము ఉద్దేశపూర్వకముగా కలిగించినదని ఈసభవారు గర్హించుచున్నారు

### తీర్మానం ४

ఒకఅధికారి "ఇచ్చట అధికారమేలేదు ఇన్స్పెక్టరు ఈ 'స్కూలు' పిల్లలను కొట్టుము" అని పలికినందుకు ఈసభవారు చాలా విచారించుచు కోపమును వెలిబుచ్చుచున్నారు.

### తీర్మానం ౫

వైస్ఛాన్సలర్‌న్ను విద్యాపీఠాధికారులున్ను విద్యార్థులకు సహాయంచేయకుండా వారిగతివారిదేఅనివదలిపెట్టుట చాలావిచారకరం ౧౦మైళ్లు నడచి కష్టపడినవిద్యార్థులను విచారించుకొనకపోవుటఅట్లుండగా కొందరుప్రొఫెసర్లు కాలేజీఆవరణంలోనే ఒకవిందును చేసుకొనుచుండిరి. ఇవన్నింటినిబట్టిచూడగా బాధ్యులైన విద్యాపీఠాధికారులు తమవిశ్వాసమును కోలుపోయినారు.

### తీర్మానం ౬

ఉస్మానియా విద్యార్థులింటిగాలేరు. వారికి సర్వవిధాలతోడ్పడుటకు ప్రాత విద్యార్థులందరున్నూ సిద్ధముగా నున్నారు. ఛాన్సలరున్ను వైస్ఛాన్సలరున్ను విద్యార్థులయెడ సానుభూతి చూపినందులకు వారికిసభవారు కృతజ్ఞతను తెలుపుచున్నారు

### తీర్మానం ౭

దెబ్బలుతగిలిన విద్యార్థులయెడలను వారి తల్లిదండ్రులయెడను ఈసభవారు సానుభూతి చూపుచున్నారు.

---

## హైదరాబాదు స్క్వాడ్రన్

హైదరాబాదు-దక్కన్ మెహరు ౨౫ హైదరాబాదు ప్రధానమంత్రిగారు ౨౬ ఆగస్టు నాడు లండన్ విమాన మంత్రి వర్గానికి క్రిందివిధంగా తంతినంపియున్నారు:—

"గతించిన రెండు వారాలలో హైదరాబాదు స్క్వాడ్రన్ విపరీతమైన విజయాలుపొందిన విషయము అపారమైనతృప్తినికలిగించినది మ. ఘ. వ. వారు ఈ ప్రశంసనీయమైన ఘనకార్యాలకు తమఘనమైన అభినందనాలను తెలుపుమనిన్ని కోరియున్నారు.

### హి. ఎ. సర్ అక్బరీ హైదరిగారికి జవాబు

హైదరాబాదు [దక్కన్], మెహరు ౨౭ హైదరాబాదు ప్రధానమంత్రిగారి తంతికిఈవిధముగా ఇంగ్లిస్థాన్ విమానమంత్రియైన సర్ ఆర్కిబాల్డుసింక్లేరు గారుప్రత్యుత్తరమిచ్చినారు:— "మ. ఘ. వ. నిజాంగారి అభినందనపుతంతిచేరినది. గాఢముగా కృతజ్ఞులైయున్నాము. మేమున్నూ చాలా ఆనందించుచున్నాము."

---

### ఖైర్పూర్ మీర్

హైదరాబాదు(దక్కన్), మెహరు-౨౭ ఖైర్పూర్ నవాబుగారు ఎల్లోరా అజంతా లను చూచుటకువచ్చి వెళ్లిపోయినారు.

---

## శ్రీబాలాజి భక్తమండలి ప్రయాణము

(స్వ.వి.) మహబూబునగరం, ౨౬-౧౧-౪౯

ఈమండలి ఈజిల్లాస్థానములో గత సంవత్సరముయనగా ౧౩౪౯ వసంవత్సరములో శ్రీ కిషన్‌సింగ్ గారి యధ్యక్షతన స్థాపింపబడెను. ఈమండలియొక్క ఆశయమేమన అనాథులకు అన్నదానమొసగుటయు, ప్రజాహితకార్యములలో ధనము వెచ్చించుటయు దేవాలయములు మొదలగు దైవతా కార్యములకు సహాయపడుటయునైయున్నది.

గతసంవత్సరమే ఈమండలినుండి ఒక భక్తిరసమైనడ్రామాఆడి శ్రీబాలాజీ ఇప్పుడు కొన్నిరోజులలో నారాయణపేట, రాయచూరు, గుల్బర్గ వెళ్ళుట కుద్యుక్తులై యున్నారు. వారు వీరిసౌకర్యార్థమై మరి అనాథుల సహాయార్థమై పాటుపడుచున్న ఈమండలికి సగౌరవముగా స్వాగతమొసగి దీని యభివృద్ధిని కోరగలరని నమ్ముచున్నాను.

---

## శ్రీ అత్మూరి లక్ష్మీనరసింహసోమయాజి గారి జయంత్యుత్సవము

(ఒ.వి.) ఖమ్మంమెట్టు, మెహరు-౨౭

ఈశ్రావణబ॥ ౯, ౧౦, ౧౧, శని, ఆది, సోమవారములందు (౨౪, ౨౫, ౨౬ ఆగస్టు) ఈ పురమున శ్రీ అత్మూరిలక్ష్మీనరసింహ సోమయాజిగారి జయంత్యుత్సవము ఖమ్మంమెట్టు వర్తక సంఘాధ్యక్షులును, విజ్ఞాననికేతనాధ్యక్షులును, సహకారపరపతి బ్యాంకు ఉపాధ్యక్షులును, నిర్వచనసంగ్రహానంద రామాయణ గ్రంథకర్తలును అయిన శ్రీ అమల పూర్ణానందంగారిఅధ్యక్షతన శ్రీ అత్మూరి లక్ష్మీనరసింహ సోమయాజిగారి జయంత్యుత్సవము ఆహ్వానసంఘమువారిచే ఆర్యపల్లివారిమోతుకు లక్ష్మీవిలాస అన్నసత్రములో జరుపబడినది. ఉత్సవకార్యక్రమములందు స్థానికవైశ్యులు, వైశ్యేతరులు, సుమారు ౫౦౦పైగా పాల్గొనిరి వ్యాయామప్రదర్శనమునకు ౧౦౦౦కిపైగా ప్రేక్షకులువచ్చిరి. స్థానికులేగాక గుంటూరునుండి ఆర్యవైశ్యమహాసభాధ్యక్షులు శ్రీ మద్ది వెంకటసుబ్బయ్య, సుప్రసిద్ధదైవజ్ఞులు, శ్రీగాదేపల్లి రామబ్రహ్మార్యసిద్ధాంతి, మాటూరిగురువాధాని వ్యాయామశాలసంపాదకులు శ్రీఆచార్యరడే వీరరాఘవయ్యగుప్త (శిష్యులసహా) వైశ్యగురుకుల పూర్వవిద్యార్థులు బెజవాడనుండి భారతీయవైశ్యసంపాదకులు శ్రీఅన్నవరపు సుబ్బారావు గుప్తగార్లును విచ్చేసిరి.

---

## జాగీరు ప్రజాసంఘము

పైసంఘకార్యాలయము హైద్రాబాదు ఫీల్ఖానాలో శ్రీసదన్‌లో స్థాపింపబడియున్నది. ఈకార్యాలయమునుండి అప్పుడప్పుడు జాగీరు అవసరంకొరకు ప్రభుత్వాజ్ఞలను తెలుపుటకు ప్రజాసేవకులు కావలెను. అట్టివారు తమ పేర్లు సాలను తెలిపితే వారితో అవసరము కొలది గౌరవార్థపు పనితీసుకొనుచుండుము. ఈవిధంగా ఈ సంఘానికి తోడ్పడే ప్రజాసేవకులెందరుందురో తెలుసుకొన గోరుచున్నాము.

కార్యదర్శి

---

## వైశ్యయువజన సంఘ స్థాపన

(ఒక విలేఖరి)

జగిత్యాల మెహరు ౨౦

జగిత్యాల జాగీరు అగ్రగ్రంథాలయమునందు శ్రావణశుక్రవారనాడు వైశ్యులందరు సమావేశమై వైశ్యయువజనసంఘము స్థాపించి ప్రతిశుక్రవారంసమావేశమగుటకునిశ్చయించిరి. శ్రీ. ఎస్. లక్ష్మిరాజగుప్త అధ్యక్షులుగా శ్రీ శెట్టి వెంకన్నగుప్తగారిని కార్యదర్శిగా నిర్ణయించిరి. తర్వాత జయిసెట్టి లక్ష్మినారాయణ గుప్తగారు ఈసంఘముయొక్క ఆశయములు వెల్లడించిరి. ఈసంఘంమతరాజకీయరంగాలలో పాల్గొనదనియు వైశ్యసంఘములో యేదేదో నాచారములుగలవో వాటినిరూపుమాప సంఘాభివృద్ధికై ప్రతిసభ్యునికర్తవ్యమని నుడివిరి వైశ్యయువకులందరు తమఆమోదమును తెల్ప సభముగించబడెను.

---

### దండు వెంటయ్యగారిదానం

హైదరాబాదు(దక్కన్) మెహరు-౨౭ దండు వెంటయ్యగారు యుద్ధసహాయపుగార్డన్‌ఫీటుకుగాను ౧౦౦౦ కల్దారురూపాయలు దానంచేసినారు.

---

### మోహన్లాల్ మలానీ

సికింద్రాబాదు(దక్కన్). మెహరు ౨౭ రాయిసాహెబ్ మోహన్‌లాలు మలానీగారి గౌరవార్థము గతశుక్రవారమునాడు సికింద్రాబాదులో విందుజరుపబడెను. సికింద్రాబాదు ప్రముఖులలో అన్నిమతాలవారును ఈవిందుకు ఏర్పాటుచేసినారు.

---

### గజాననోత్సవము-బొమ్మలగూడ

హైద్రాబాదు (దక్కన్) ఆశ్వీన్ 3 హైద్రాబాదులోని బొమ్మలగూడలో యువజనసంఘమువారు ౫-౬ సెప్టెంబరు తేదీలలో గణేశోత్సవమును జరిపినారు. పూజ, హిందూ బీదల కన్నదానం, భోజనపురాణశ్రవణము, ఉపన్యాసాలు, వినోదాలు యివన్నియు జరుపబడినవి.

---

### న॥ మెహిదీయార్జంగుగారు

హైదరాబాదు (దక్కన్) మెహరు-౨౭ ఉస్మానియా ప్రాతవిద్యార్థి సంఘమువారు నవాబు మెహిదీయార్జంగు బహద్దరుగారిని తమ సంఘములో గౌరవసభ్యులుగాచేసినారు, నవాబుగారు సభ్యత్వస్వీకారముపై సంతోషము చేసినారు. ఇదేఉస్మానియా ప్రాతవిద్యార్థి సంఘంవారి సభలో ప్రభుత్వప్రకటన అంతాతప్పని తీర్మానించినారు ప్రభుత్వప్రకటనను అనుసరించి విచారించుటకు నవాబ్ మెహిదియార్జంగు బహద్దరుగారు కమిటీసభ్యులుగా నియమింపబడినారనియూ ఆదేసభలో ప్రకటించినారు.

---

## వైస్రాయి ఇండియా మంత్రుల ప్రకటనలు

ముస్లింలీగు కార్యవర్గమువారి సంతోషము

అఖిలభారత ముస్లింలీగు కార్యవర్గమువారు బొంబాయినగరములో ఆగస్టు ౩౧వ, సెప్టంబరు ౧, సెప్టంబరు ౨వ తేదులలో ఆలోచనలు జరిపి నర్వాత ౨వ తేదీనాటి సమావేశములో ఆమోదించిన తీర్మానములలో ఈక్రింది అంశములు ముఖ్యమైనవి:-

వైస్రాయిగారిటీవల భారతదేశరాజ్యాంగ సమస్యనుగురించి గావించినప్రకటన దానిపై ఇండియా సెక్రటరీ ఆఫ్ స్టేట్ అగు అమెరీగారు బ్రిటిషు పార్లమెంటు కామన్సుసభలో గావించిన ఉపన్యాసము ముస్లింలీగువారికోరికకు అనుకూలముగా ఇదివరలో ప్రకటనలకంటె ఎక్కువ ముందుకునడచి, ఆకోరికను దాదాపుగాతీర్చుచున్నవి. తాత్కాలికముగగాని, రుదకుగాని ఏర్పడు భారతదేశభావిరాజ్యాంగమును ముస్లింలీగువారి అనుమతి, అంగీకారములేనిదే అనుసరించరాదు.

కాని వైస్రాయిగారి ప్రకటనలోను అమెరీగారి ఉపన్యాసములోను భారతదేశమంతయు ఏకజాతీయతగలదేశముగా భావించబడియున్నది. కాని యిట్టిఏకజాతీయత ఇపుడుగాని, యిదివరలోగాని అమలులోలేదు. దేశమును ముస్లిం భారతదేశము, హిందూభారతదేశమని రెండు భాగములుగ విభజించుటయే ముస్లింలీగుకు సమ్మతము.

ఇక గవర్నరు జనరలు కార్యనిర్వాహకవర్గమునందు అదనముగాకొందరు సభ్యులను చేర్చుకొనెదమని చెప్పిరేగాని ఎంతమందినిఅనుసంగతి ముస్లింలీగు అధ్యక్షులవారికిగాని, కార్యనిర్వాహకవర్గమువారికిగాని తెలిపియుండలేదు. గవర్నర్ జనరలుగారి కార్యనిర్వాహకవర్గమునంతటిని ఏవిధముగా సంస్కరింతురో, ముస్లింలీగు ఆవర్గమునందు ఏఏపార్టీలతో కలిసిపనిచేయవలసివచ్చునో, అదనముగా గ్రహించుసభ్యులకు ఏఏపరిపాలనశాఖలనప్పగింతురో--ఈఅంశములు తెలుపబడలేదు. మరియు ప్రతిపార్టీపక్షమునకొందరు ప్రతినిధులను ఆయాపార్టీవారు సూచించినచో వైస్రాయిగారు ఆసూచిత ప్రతినిధులలో తమకు కావలసినవారలను గ్రహింతుమనిచెప్పినారు. ఈ పద్ధతి ముస్లింలీగువారికి నిరాక్షేపణీయముగ కనుపించుటలేదు.

యుద్ధసలహా సంఘనిర్మాణవిషయములోగూడ ఇదేవిధంగా దానిని నిర్మాణమేరీతిగాజరుగునో, దానిలోఎంతమంది, ఎవరెవరు సభ్యులుందురో, దానికధికారమేమో ముస్లింలీగుకార్యవర్గమువారికి తెలియదు. అందువలన ఈసమాచారమంతయు వివరముగా తెలియువరకు వైస్రాయిగారి సూచన ముస్లింలీగువారికి సంతృప్తికలిగించజాలదు. వివరములను తెలిసికొనుటకు అధ్యక్షులవారికి అధికారమీయబడినది.

## సింహళ రాజ్యాంగ సంస్కరణము

ప్రజాప్రతినిధి పరిషత్తుకావలెనని కోరుట

సింహళద్వీపము బ్రిటిషువారి సామ్రాజ్యములో చేరినదే, భారతదేశములో సంపూర్ణస్వపరిపాలనము కావలెనను కోరిక ఎట్లు ప్రబలియున్నదో సింహళములోకూడ అట్టికోరికయే యున్నది. భారతదేశములో ఎటువంటిరాజ్యాంగము కావలెనన్నవిషయములో అందరును సమ్మతించిన కాంగ్రెసు సూచన తమకు తెలుపబడునో, తదనుసారము ఏర్పాటుచేసెదమని బ్రిటిషువారు చెప్పుచుండుటవలన, కాంగ్రెసువారు ప్రజలలో అన్నితెగలవారి ప్రతినిధులుగల "ప్రజాప్రతినిధి పరిషత్తు" ఏర్పాటు చేయవలసినదనియు, ఆ పరిషత్తువారు అందరికిని సమ్మతముగా నుండగల రాజ్యాంగమును సూచించగలరనియు తెల్పుచున్నారు. సింహళములోకూడ అట్టి ప్రజాప్రతినిధి పరిషత్తు కావలెనుకోరికి సింహళశాసనసభయగు స్టేట్ కౌన్సిలులో తీర్మానములనుగూర్చి చర్చసమయమున ఆర్. శ్రీపద్మనాథన్ అను సభ్యుడుతెలిపెను.

బ్రిటిషుప్రభుత్వమువారు సింహళవిషయములలో యుద్ధముయొక్క లక్ష్యము ప్రకటించవలెననియు, బ్రిటిషుసామ్రాజ్యమునందలి యితర ప్రజల కెట్టిస్వాతంత్ర్యమున్నదో అట్టిస్వాతంత్ర్యము సింహళీయులకును యివ్వబడునని బ్రిటిషు ప్రభుత్వమువారు ప్రకటించినచో, సింహళీయులలో అన్నితెగలవారలును ఇప్పుడు యుద్ధములో

## జాతీయ ప్రణాళిక నిర్మాణ సంఘము

జాతీయప్రణాళికలో స్త్రీలకేదయేపనులుండునను విషయముపై ఆగస్టు౩౧వతేది బొంబాయిలో జాతీయప్రణాళిక నిర్మాణసంఘములో చర్చ జరిగెను. ఈవిషయమున అభిప్రాయమిచ్చుటకై నియోగించబడియుండిన ఉపసంఘమువారి నివేదికలోని అన్నిఅంశములను సభవారు విపులముగా చర్చించిరి. ఉపసంఘమువారి సూచనలలోని అన్ని అంశములను చేర్చినతీర్మానములను ఆమోదించిరి

## మరల గాంధిమహాత్ముని నాయకత్వము?

సరిహద్దురాష్ట్ర కాంగ్రెసు నాయకుడగు ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్ గారితో చర్చచేసినతర్వాత గాంధిమహాత్ముడు కాంగ్రెసుకు మరల నాయకత్వము వహించుటకు అంగీకరించవచ్చుననియు ఆచర్చలలో డాక్టర్ సయ్యద్ మహమ్మద్ గారుకూడపాల్గొనగలరనియు "యునైటెడ్ ప్రెస్" వారనుచున్నారు.

## విశాఖపట్టణంవద్ద నౌకానిర్మాణము

విశాఖపట్టణమువద్ద నౌకలను నిర్మించుటకు సౌకర్యములను ఏర్పాటుచేయుపని అతివేగముగా సాగుచున్నది. రేవుముఖద్వారముగానున్న కాలువయొక్క దక్షిణప్రక్కన నీటిఅడుగున నుండేమట్టి తీసివేయుపని పూర్తిచేయబడినది. హార్బరుయొక్క మలకాపురపువైపు ఉద్యోగుల నివాసములనిర్మాణము పూర్తికావచ్చుచున్నది.

బ్రిటిషువారికి కావలసినధనమును సేనలనుసంతోషముతో సమకూర్చగలరనియు, లేనిచో "మేము మాధనమ్మును భారతదేశమునకుచేర్చి, స్వాతంత్ర్యమునకై ఆదేశీయులు జరుపుచున్న పోరాటములో భారతదేశపు ఫెడరేషనులో చేరగల" మనియు ఆసభ్యుడుచెప్పెను.

## రాజగోపాలాచారిగారి క్రొత్తసూచన

సింధుమంత్రి మెచ్చుకొనుట

కాంగ్రెసుకును ముస్లింలీగుకును స్థిరమైనమైత్రి కుదుర్చుటకు రాజగోపాలాచారిగారి ప్రకటన మంచి ఆధారముగ నుండగలదనియు, అందలి అభిప్రాయములను కాంగ్రెసు ముస్లింలీగులందరికి తెలియబరచిమైత్రికోరుట మంచిదనియు-సింధుప్రభుత్వమునందు ఆర్థికమంత్రియు, ఇదివరలో అఖిలభారత ముస్లింలీగు కార్యవర్గ సభ్యుడును నగు షేక్ అబ్దుల్ మజీద్ గారు "యునైటెడు" ప్రెస్ వారికి చెప్పినారు.

కేంద్ర శాసనసభకు బాధ్యమైయుండెడి మంత్రివర్గము నేర్పరచుటకు ముస్లింలీగువారి సభ్యుడు ప్రధానమంత్రిగానుండుటకు కాంగ్రెసు అంగీకరించునట్లు తాను యత్నించగలనని రాజగోపాలాచారిగారిదివరలోచెప్పియుండెనుసంగతితో దీనికిసంబంధము.

## నాగపూరు మాడల్ మిల్లు సమ్మె ముగింపు

పోయిన జులై ౩౦వతేదినుండిసమ్మెకట్టియున్న నాగపూరు మాడలుమిల్లుపనివారలు ౩౦౦ మంది సెప్టెంబరు ౧తేదినుండి పనిలోచేరిరి. మిల్లుయజమానులుకూడ మూసియున్న మిల్లులను తెరచి ఆగస్టు ౩౦వతేదిరాత్రి బహిరంగసభలో పనివాండ్రు పనిలో చేరకూడదనియే తీర్మానించుకొనిరి. కాని మరునాడు నాగపూరు నేతపనివారల సంఘముయొక్క అధ్యక్షుడగు ఆర్. యస్. రుయ్కర్ గారు ప్రభుత్వ పరిశ్రమశాఖ కార్యదర్శి గారితో సంభాషించగా, ఆకార్యదర్శిగారు పనివారలు వెంటనే సమ్మెచాలించుట మంచిదనియు, అట్లుచాలించి పనివారలు పనులలోచేరినచో, యజమానులు వారలను తక్కువగాచూచి బాధపెట్టరనియు, పనివారలకు యుద్ధకారణముచే ధరలు పెరిగినందుకై ఎక్కువకూలి ముట్టచెప్పువిషయములో ప్రభుత్వమువారు మిల్లుయజమానులతో యత్నించగలరనియు మాటయిచ్చుటచే, పనివారలు మొదటితీర్మానము వదలుకొనినట్లు తెలియుచున్నది.

## సితామా సంస్థానములో ప్రజాపీడనం

మధ్యరాష్ట్రప్రాంతమునకుచేరిన సితామా సంస్థానములో కఠినవిధానము అవలంబించబడినదనియు, దానినిగూర్చి విచారణచేయుటకై మధ్యరాష్ట్రప్రాంత సంస్థానాలమహాసభ పక్షమున ఒకప్రతినిధిని పంపించవలసినదనియుఆసంస్థాన ప్రజామండలి ప్రచారకులు మధ్యరాష్ట్రప్రాంత సంస్థాన ప్రజామహాసభయొక్క అధ్యక్షుడగు ఆచార్య నరేంద్రదేవు గారితో మొఱపెట్టుకొనినారు.

ఇటీవలనే సంస్థానాధికారులు ప్రజామండలి కార్యదర్శిని సంస్థానమునుండి తరిమివేసి, సితామాలో ప్రజామండలివారి గ్రంథాలయభవనమునకును, పఠనాలయమునకును తాళమువేసియుండిరి.

మధ్యరాష్ట్రప్రాంత సంస్థాన ప్రజాసేవకులుఈసారి రాష్ట్రీయమహాసభను, అఖిలభారత సంస్థాన మహాసభను జరుపవలెనని కోరికగలిగియున్నరుకాని దేశముయొక్క ప్రస్తుత పరిస్థితిలో ఆసభలను జరుపుట మంచిదికాదను అభిప్రాయము బాధించుచున్నది. ఈప్రాంతపు సంస్థానాలలో ప్రస్తుత రాజకీయస్థితిని ముఖ్యముగా ఇండూరు, గ్వాలియరు భోపాలు, రత్లం, ఝాబువా, సితామా సంస్థానాలలో స్థితిని ప్రధానకార్యదర్శి కన్యావాల్ డి. వైద్యగారికి తెలియజేయుటకై సంయుక్తకార్యదర్శి ఆగస్టు ౩౧వతేదిని బొంబాయికిపోయెను

## గ్రంధనిషేధము

ఈక్రిందిగ్రంథాలు నిజాంరాష్ట్రంలో నిషేధింపబడినవి.

౧ హిందువులకు హెచ్చరిక (ఎవార్నింగ్ టుది హిందూస్) అనుగ్రంథం. దీనిని సావిత్రిదేవిగారు రచించినారు. ఈగ్రంథంలో హిందూ మసల్మానులలో అసమానము కల్పించేయు విషయాలున్నవి. కావున మ.ఘ.వ ఫర్మాను ప్రకారము ఈగ్రంథంకాని అనువాదంకాని రాష్ట్రములో ఉండకూడదు

౨. ఆర్యసంస్కృతియొక్క ఉత్పత్తిపతనాలు Rise & fall of Aryan culture మానవశాస్త్రి రచితం. దీనివిషయంలో కూడా పైగ్రంథంవలెనే ఫర్మానువెళ్ళినది.

## ముస్లింలీగు, హిందూ మహాసభల సుడిగుండం

భారతదేశ స్వాతంత్ర్యసమస్యముస్లింలీగు,హిందూమహాసభల సుడిగుండంలోపడితిరుగుచున్నది.

కాంగ్రెసువారు భారతదేశమంతయు ఒకటేజాతియను సిద్ధాంతముపై నిలిచియుండ, ముస్లింలీగువారు భారతదేశాన్ని ముసల్మానుభాగము, హిందూభాగము అని రెండుగా చీల్చవలెననికోరుచున్నారు. సెప్టంబరు ౧వతేది సాయంకాలము బొంబాయినగరంలో జరిగిన ముసల్మానుల బహిరంగసభలో ఫజ్లుల్ హక్, మహమ్మదాబాదు రాజా, మున్నగు ముస్లింలీగునాయకులుపాకిస్థాను విధానము ఆవసరమని ఉపన్యాసాలిచ్చినతర్వాత పాకిస్థాను విధానమును బలపరచు తీర్మానము ఆమోదించబడెను.

ముస్లింలీగును సంతృప్తిపరచుటకై వారికి ప్రధానమంత్రిపదవి నిచ్చుట మున్నగువాటికి కొందరు కాంగ్రెసునాయకులు సంసిద్ధపడుచున్నారు. కాని హిందూమహాసభనాయకుడగు డాక్టర్ బి. యస్. మూంజీగారు ఈసూచనకు హిందువులెంతమాత్రము సమ్మతించరని సెప్టంబరు౧వతేదినాడు నాసికనుండి గావించినప్రకటనలో సూచించి, ఇట్టిమిత్రులనుండి పరమేశ్వరుడు భారతదేశమును రక్షించుగాకయని ప్రార్థించినారు.

ఈవిధముగా ఒకరుచెప్పినదాని కొకరు సమ్మతించక వాదులాడుటయేగాక ప్రతిఘటించుట భారతదేశ స్వాతంత్ర్యమునకు సుడిగుండముగా కనపడుచున్నది.

## కాంగ్రెసు కర్తవ్య నిర్ణయ సమయము

ఇటీవల వైస్రాయిగారు గావించిన ప్రకటనవల్ల పరిస్థితులు తేటతెల్లమైనవిగనుక ఇంతటితో భారతదేశమందలి రాజకీయ ప్రతిష్టంభనము అంతమైపోవుననియు, ఇకమీద కాంగ్రెసు తనముందుకర్తవ్యమును నిర్ణయించుకొనుపనిమాత్రమే మిగిలియున్నదనియు, కాంగ్రెసువారు తమశక్తులను ఎంతవరకుకూడ దీనికొనగలరో ఇప్పుడాలోచించదగునని పండిత జవహర్లాలు నెహ్రూగారు సెప్టంబరు ౧వతేది సాయంకాలము బొంబాయిలో చౌపాటిలో బహిరంగసభయందుపన్యసించుచు చెప్పిరి.

ఇదేరోజు పూనాలో కాంగ్రెసుభవనంలో జరిగిన బహిరంగసభలో వైస్రాయిగారిప్రకటనపైఅసమ్మతిని తెలుపుఉపన్యాసములుచేయబడెను.

## నిజాంరాష్ట్ర మున్నూరు కాపు యువకమండలి

హైదరాబాదు (దక్కన్)

బాల్యవివాహ నిరోధక శాసనము వెంటనే కావలెను

నిజాంరాష్ట్ర మున్నూరుకాపు నవయువక మండలి (హైదరాబాదు యొక్క) సభ్యులమహాసభ ౩౦ ఆగస్టు ౧౯౪౦ శుక్రవారము పగలు ౩ గంటలనుండి సుల్తానుబజారులోని శ్రీరాజా ప్రతాపగిర్జీ కోఠిలో మండలి అధ్యక్షులగు శ్రీవీర్జీం సత్యనారాయణగారి అధ్యక్షతతో సమావేశమైనది. సుమారు ౧౦౦మంది సభ్యులును, ౨౫గురు ప్రత్యేక అహ్వానములు పంపబడిన మహాశయులును సభకు విచ్చేసియుండిరి.

దైవప్రార్థనలతో కార్యక్రమము ఆరంభింపబడినది. మొట్టమొదట శ్రీబొజ్జంనరసింహులుగారు కారణాంతరములవలన సభకు రాజాలనందులకు విచారపడుచు యువకులు ఉత్సాహములో జాతియొక్క సేవచేయవలెనని ప్రబోధించుచు పంపిన సందేశము చదివి వినిపింపబడెను. అధ్యక్షపీఠము నుండి ప్రవేశపెట్టబడిన మండలిసభ్యులగు ౧ కొమ్మురంగయ్య ౨. కొమ్ము సత్యనారాయణ ౩, గొల్లపల్లి రామయ్య ౪. ఆదియాదయ్యగార్ల అకాలమరణమునకు సమాశ్వాసము తెల్పుచు తీర్మానము సభ్యులందరును నిలువబడి ఆమోదించిరి. కార్యదర్శియగు శ్రీకొప్పుల వెంటయ్యగారు నివేదిక చదివి వినిపించిరి.

సహాయకార్యదర్శియగు సంగిసెట్టి బాబయ్యగారు కార్యనిర్వాహకసంఘమువారు ఆమోదించిన నియమావళి సవరణలను ప్రవేశపెట్టిరి ఈ తీర్మానము దీర్ఘమైన చర్చజరిగిన అనంతరము సభవారు ఏకగ్రీవముగ అంగీకరించిరి (సవరణలో ఇకముందు ఈమండలి "మున్నూరుకాపు యువకమండలి" యని పిలువబడుననునది ఒక ముఖ్యమైనఅంశము బాల్యవివాహ నిరోధకచట్టమును ఆమోదించు ఈక్రిందితీర్మానము శ్రీ ఆర్. సత్యనారాయణగారిచే ప్రవేశపెట్టబడి ఏకగ్రీవముగ అంగీకరింపబడెను. తీర్మానము "నిజాంరాష్ట్ర మున్నూరుకాపు యువకమండలి మహాజనసభవారు ప్రజాభిప్రాయమునకై పంపబడిన బాల్యవివాహ నిరోధక చిత్తుచట్టమును ఏకగ్రీవముగ ఆమోదించుచు వెంటనే అంగీకరించవలెనని ప్రభుత్వమువారిని కోరుచున్నారు."

కార్యనిర్వాహకసంఘమువారు ఏర్పరచిన మున్నూరుకాపు విద్యానిధిని, "విద్యార్థిసంఘము విద్యావిషయిక ప్రణాళికను ఆమోదించుచు, అఖిలభారత మున్నూరువారికాన్ఫరెన్సు,

## పంజిల్లానిర్మాణ వివాద విచారణ

సింధురాష్ట్రమునందు సుక్కూరుజిల్లాలో మంజిల్గాలోని సర్కారుము మసీదుఅయియుండెనాయను అంశమునుగూర్చి హిందూమహమ్మదీయులకు ఉదయించియుండిన వివాదమును పరిష్కరించుటకై సింధురాష్ట్రప్రభుత్వముచే నియుక్తుడైన జస్టిస్ వెస్టన్‌గారు ఆగస్టు ౩౧ వ తేదినుదయము విచారణపూర్వము తేల్చుకొనవలసిన అంశములను తేల్చుకొనుటకై ప్రథమసమావేశముజరిపిరి. ముస్లింలీగుపక్షమున సింధు అసెంబ్లీసభ్యుడగు యం. హెచ్. గజ్దార్ గారు మంజిల్గాభవనము మసీదుగానే నిర్మితమైనట్టిదని వాదించుపత్రమును సమర్థించిరి. హిందువులపక్షమున సుక్కూరు హిందూ సభఅధ్యక్షులగు నిహ్ మాల్ బేగురాజ్‌గారు అది మసీదు కాదనియు, ప్రభుత్వభవనమనియు వాదించిరి

కొంతచర్చజరిగినతర్వాత అదిమసీదని రుజువుచేయుభారము ముసల్మానులదని నిర్ణయించబడినది. అందుచేముసల్మానులు తమవాదమును నిరూపించుటకు అవసరమగుసాక్షులను, చారిత్రకపత్రములను, నక్షాపత్రములను సెప్టంబరు ౨౧ వ తేదిలోగా పంపుకొనవలెనని న్యాయవిచారణాధికారి నిర్ణయించెను.

ప్రధానన్యాయవిచారణ సెప్టంబరు ౨౫ వ తేది ప్రారంభించబడును.

ఈలోగా సుక్కూరులో మంజిల్గాభవనమును ప్రజలు మాపరాధూనసనియు, అందుప్రవేశించరాదనియు నిషేధించుఆజ్ఞ అమలులోనుండదగిన అవధిసమీపించుటచే, సుక్కూరుజిల్లా మేజిస్ట్రేటుగారు ఆయాజ్ఞ మరిరెండునెలలు అమలులోనుండగలదని ఆజ్ఞగావించినారు. అనగా అక్టోబరుఆఖరువరకు అమలులోనుండగలదు.

నిజాంరాష్ట్ర మున్నూరుకాపు కాన్ఫరెన్సులయొక్క సమావేశములలో మండలిసభ్యులు సాధ్యమైనంతవరకు తోడ్పడవలెననియు ప్రవేశపెట్టబడిన తీర్మానములు అంగీకరింపబడినవి.

తరువాత కార్యనిర్వాహక సభ్యులపక్షమున ఏర్పరచిన అల్పాహారపువిందు జరిగినది, ఈవిందును నిర్వహించుటలో శ్రీపి. జగమోహన్‌గారు చాల శ్రమతీసికొని మంచిఏర్పాట్లుచేసినారు.

తుదపరి మండలికి నూతనఎన్నికలు ఈక్రింది విధముగ జరిగినవి.

అధ్యక్షులు— శ్రీ కే. జగన్నాయకులుగారు
ఉపాధ్యక్షులు ,, ఆల్లాడినాగయ్యగారు
కార్యదర్శి— ,, సంగిసెట్టి బాబయ్యగారు
కోశాధ్యక్షుడు ,, తుంగా రామదాసుగారు
౧౦ మంది కార్యనిర్వాహకసభ్యులు.

## ఖాక్సారులపై నిషేధమును తొలగించుట

ఖాక్సారు నాయకుడు షకనుల్లా ఖాక్సారులు శాసనోల్లంఘనమును చేయుచని పంజాబుప్రభుత్వానికి అభయమిచ్చినట్లును, అందుపై ఇప్పుడు పంజాబుప్రభుత్వమువారు పంజాబులో ఖాక్సారులు శాసనవిరుద్ధసంఘమని మార్చి ౧౯వ తేదినాడు గావించిన ప్రకటనను రద్దుచేయుటకు నిశ్చయించినట్లును తెలియుచున్నది.

ఇదేవిధముగ ఇటీవల ఇండియా ప్రభుత్వమువారు సైనికులు చేయుడ్రిల్లువంటిడ్రిల్లును ఇతరులు చేయరాదనియు, సైనికులు ధరించు దుస్తులవంటిదుస్తులను ఇతరులు ధరించరాదనియు గావించి యుండిన ఆజ్ఞలనుకూడ విధేయులమై యుండెదమని ఖాక్సారులు మాటయిచ్చుటవలన, ఇండియాప్రభుత్వమువారు ఢిల్లీ రాష్ట్రములో ఖాక్సారులు శాసనవిరుద్ధసంఘమని మార్చి ౨౦వ తేదిన గావించియుంచిన ఆజ్ఞను రద్దుచేయుటకు తీర్మానించినారు.

సెప్టెంబరు ౩వ తేదినాడు సంయుక్తరాష్ట్ర ప్రధానపనగరమగు లక్నోలో ఖాక్సారుల భావికార్యక్రమమునుగూర్చి ఖాక్సారునాయకులు ఆలోచించదలచుటచే, ఆసభకుపోవుటకై సరిహద్దురాష్ట్రమునుంచి ఇరువురు ఖాక్సారునాయకులు ఆగస్టు ౩౦వ తేది లక్నోకు ప్రయాణమై పోయిరి

## వైద్యులకును, రోగులకును ఒక ముఖ్యసూచన

శ్రీ దయానంద ఆయుర్వేదిక కాలేజి ఫార్మసీ [లాహోరు]

యందలి ఔషధములు నేను వాడి చూచినాను ఔషధములన్నియు శాస్త్రసిద్ధముగా తయారు చేయబడుచుండుటచే శాస్త్రోక్తములగు గుణములను సరిగా చూపించుచున్నవి. ఆసవారిష్టములు, చూర్ణములు, మాత్రలు, రసౌషధములు, లేహ్యములు, భస్మములు, విధిగుణదాయకము లగుటయేగాక ధరలు కూడా చాలా సరసముగానున్నవి. కేవలం ఆయుర్వేద ఉద్ధరణయు కళాశాల నిర్వహణమును, యదార్థగుణములను బయల్పరచి ఆయుర్వేద ప్రాశస్త్యమును ప్రచారమునకు తేవలయుననుతలంపుతో పనిచేయుచున్న ఈ "దయానంద" ఆయుర్వేద ఫార్మసీ ఔషధములను వైద్యులు వైద్యేతరులును ఉపయోగించి ఆయుర్వేద ప్రచారమునకు సహాయపడగలరనియు, సవ్యమైన గుణమును పొందగలరనియు తెలియజేయుచున్నాను.

వేదాల తిరుమల
వేంకట రామానుజస్వామి
శతావధాని, ఆయుర్వేదాచార్య
హైదరాబాదు-దక్కన్

నిజాంరాష్ట్రమువారు ఈక్రింది శాఖ నుండి ఔషధములను కొనగలరు.

హకీం జయరాందాస్
వైద్యరాజ్
బ్రాంచి: దయానందఆయుర్వేదిక్ కాలేజి ఫార్మసి
కోఠీ ఒప్పుస్టాండు, సుల్తానుబజారు,
హైదరాబాదు-దక్కన్

సంవత్సరము చందా
౬ హాలీ రూపాయిలు
ఆరుమాసాలకు
3 రూపాయిలు
బ్రిటిషిండియాలో
సం॥చందా
౫-౪-౦ కల్దారు.
పాతపత్రికలకు
వెల ప్రత్యేకము.

# గోలకొండ పత్రిక

# Golkonda Patrika

The only Popular Paper That reaches The masses In the Dominions
Best Medium for Advertisement

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

Volume 15 | Hyderabad-Dn. | Monday 9 September 1940 | Number 36

## బ్రిటను జర్మనీల యుద్ధము

(౮వపేజి తరువాయి)

లండనునగరముపై మూడుదాడులుజరిగెను. అందుచే ఇండ్లును, పారిశ్రామిక భవనములును చెడెను. అనేకచోట్లలో ఇండ్లకు మనుష్యులకునుకూడ పెద్దదెబ్బలుతగిలెను. ఉదయపుదాడిలో థేమ్సు నదీసముద్ర సంగమస్థలములో విమానాశ్రయములకు కొంతనష్టముకలిగెను. రాత్రిదాడిలో దక్షిణసముద్రతీరమందు కొన్నిఇండ్లు పాడుచేయబడెను.

### మార్షల్ గోరింగుగారు

లండనుపైదాడిలో ఈ సెప్టంబరు ౧ వ తేదినాడు జర్మనీ ర్వసేనాధిపతియగు మార్షల్ గోరింగుగారు ఒకవిమానములోవచ్చినట్లును, బ్రిటిషువారు ఆవిమానమునుకూల్చుటచే ఆందలి గోరింగుగారు మరణించినట్లును, అసలు అశవము నిజముగా గోరింగారిదగునోకాదో పరిశీలించుటకై తీసికొనిపోయినట్లును అమెరికాలో ఒక వార్తాసంస్థవారొక వార్తనిచ్చినారు. కానిలండనులో ఒకముఖ్యాధికారి ఇదిఅసంభవమనినాడు. జర్మనులు ఈవదంతినిఖండించినారు.

### సెప్టంబరు ౨

సెప్టంబరు ౨ వ తేది ఉదయము జర్మనువిమానాలు థేమ్సునదీసముద్ర సంగమప్రాంతముపైకి పోవయత్నించగా బ్రిటిషువిమానధ్వంసక శతఘ్నులవాటిని తరుమగొట్టెను. ౧౫ నిమిషాలు బ్రిటిషువిమానాలతో పోరాటముజరిగెను. లండనునగరముపైకూడ దాడిజరిగెను జర్మనువిమానాలు వందకంటెపైగానుండెను. మధ్యాహ్నము, సాయంకాలము రాత్రివేళలందుకూడ ఇట్లే జర్మనవిమానాలు బ్రిటనుపైతిరిగి అనేక ప్రదేశములమీదికి బాంబులుపడిలెను. వాటివలన చాలాయిండ్లుపాడైనవి. సాయంకాలము ౩౦౦ జర్మనువిమానాలు దాడిచేయవచ్చెను.

### విమానాలనష్టాలు

ఈదాడులలో ఉభయపక్షాల విమానాలవారికి జరిగిననష్టాలుఇట్లున్నవి:

| తేది | జర్మనీ | బ్రిటను |
|---|---|---|
| ఆగస్టు ౩౦ | ౬౨ | ౧౯ |
| ఆగస్టు ౩౧ | ౮౮ | ౩౭ |
| సెప్టంబరు ౧ | ౨౫ | ౧౫ |
| సెప్టంబరు ౨ | ౫౫ | ౧౩ |

## జర్మనీపై బ్రిటను దాడులు

జర్మనీపైనను. జర్మనీఆక్రమించిన దేశాలపైనను బ్రిటిషువిమానాలు ప్రతిరోజురాత్రి తిరిగి విమానాశ్రయాలమీదను, పెట్రోలు ఖజానాలమీదను, పరిశ్రమల కార్ఖానాలమీదను, రైల్వేలమీదను బాంబులు వేయుచునేయున్నవి.

ఆగస్టు ౨౯ వ తేదిపగలు హాలెండులో విమానాశ్రయాలమీదను, హాలెండు సముద్రతీరమువద్ద ఓడలమీదను ఆరాత్రి జర్మనీ హాలెండు. బెల్జియం. ఫ్రాన్సులలో, అక్కడక్కడ పెట్రోలు కార్ఖానాలు, విమానాశ్రయాలమీదను బ్రిటిషువిమానాలు బాంబులువేసెను,

ఆగస్టు ౩౦వతేదిరాత్రి బర్లిను నగరముపై బ్రిటిషువిమానాలు రెండుగంటలసేపు దాడిసలిపెను. ఇంతేగాక బూలోనువద్ద సముద్రపురేవులపైనను, జర్మనీ, హాలెండులలో విమానాశ్రయాల, కార్ఖానాలపైనను బ్రిటిషువిమానాలు బాంబులువేసెను. బర్లినులో భూగర్భగతమైన విద్యుచ్ఛక్తిజనకయంత్రము పాడైనదట

ఆగస్టు ౩౧వతేది సాయంకాలము, రాత్రికూడ ఇటేవిధమైన దాడులు రోటర్డాంపైనను, జర్మనీ హాలెండులపైనను జరిగినవి రాత్రి ౧౧గంటలకు బర్లిను వాయువ్యప్రాంతంలో ఒక పెద్ద విమానాల యింజనులను చేయుకార్ఖానాపై బాంబులువేయబడెను, క్యాష్ గ్రిజెకెక్ వద్ద జర్మనుల పెద్దతుపాకులపై గూడ బాంబులువేయబడెను. ఫ్రాన్సు సముద్రతీరమువెంటకూడ ఇట్లే దాడిచేయబడెను.

సెప్టంబరు ౧వతేది జర్మనీ, ఇటలీ, హాలెండు ఫ్రాన్సులపై బ్రిటిషువిమానాల దాడులుజరిగెను.

## హైద్రాబాదు స్వాతంత్ర్య దినము

### మక్కామసీదులో మహోపన్యాసాలు

హైద్రాబాదు స్వాతంత్ర్యదినమునాడు సభలు చేయవలసియుండెను. కానిఏకారణంచేతనో సభలుఆపవేయబడినవని పత్రికలలో ప్రకటించబడెను. అయినను ౨౯ మొహరమునాడు మక్కామసీదులోను ఇతరమసీదులలోను మోతిమిర్ దక్కన్ ముస్లింనౌజవానులు సభలుకావించిరి కొన్నిమందిరాలలోకూడ ౧౩౪౨ హిజరీలో మ. ఘ. వ నిజాంగారు కావించిన ఉపన్యాసాన్నిచదివివినిపింపబడెనని పత్రికలలోవ్రాసినారు. మక్కామసీదులో నవాబు బహద్దరుయారుజంగు బహద్దరుగారు ఈవిధంగాఉపన్యాసంచేసినారు. "నేనుబొంబాయికి మీపనికొరకేపోయియుంటిని. అచ్చటనన్నుఇంకా ఉండుమని నిర్బంధించినా ప్రత్యేకంగా ఈనాటి స్వతంత్ర్యదినోత్సవములో పాల్గొనుటకైనేనిచ్చటికి వచ్చితిని. మనపూర్వనవాబులు మునుగుచుండే హిందూస్థాననౌకను మునుగకుండారక్షించినారు మద్రాసు ఘాటులోమరొకమారు మునుగనుండగా రెండవనిజాం దానినిఆదుకొనెను. మొదటి ఆసఫ్‌జా ఏవిధమైన స్వాతంత్ర్యాన్ని ఆనాడు ప్రకటించెనో తర్వాతకాలములోఏర్పడిన సంధిషరతులున్నను నేటికిని ఆమొదటిస్వాతంత్ర్య ప్రకటనవర్తించుచునేయున్నది. మనప్రభువులు ఇంగ్లీషువారికి ముఖ్యస్నేహితులు. మనపతక్షులని లెక్కపెట్టకుండా కూడా మనము ఇంగ్లీషువారికి సాయంచేయుటలో మనవారికే దుఃఖముకలిగించితిమి. ఈవిషయంలో మీరుటిప్పూ సుల్తాన్ కథను టిప్పూ ద్వారావేవినండి! అప్పుడు తెలుస్తుంది. ౧౯౨౨ క్రీ శ (?) లో (ఇది ౧౮౫౭ ఉండవలెనేమో గో. ప.) హిందూస్థానములో స్వాతంత్ర్య ప్రయత్నంజరుగగా "నిజాం జారిపోతే మనపనిఅయిపోయినట్లే" అనిఒక పైసాయిఅనిఉండలేదా? మనస్వాతంత్ర్యమునకు వ్యతిరిక్తముగా ఒకక్రీడింగు పైసాయిమాత్రమే అభిప్రాయప్రకటనము గావించెను. కానిమనవాదము ఈనాడునుకలదు ముందుకును వర్తించును.

ఇంగ్లీషువారిని ముప్పుతిప్పలుపెట్టిన బ్రిటిషిండియావారి కనడా, దక్షిణాఫ్రికా దేశాలవంటి డుమీనియన్ స్థానముదొరుకుతుందట. మరిస్నేహితమైన హైద్రాబాదుకు తనసమస్యతాను పరిష్కరించుకొను అధికారంలేదా? మన యింగ్లీషు స్నేహితులకు ఎక్కువసహాయం చేయుటకు మనప్రభుత్వంవారు తోపులు, తుపాకులు మందుగుండుసామాను వెంటనే రాత్రికిరాక పగలన. సిద్ధంచేయనిలెను. టిప్పూపైకి పంపినసేనయంతయైనను నిజామలీఖాన్ మనుమనికి ఈనాడు పెట్టుకొనుటకుఆర్హతలేదా? ముసల్మానులందరును పౌజాగామారి పోవలసిందె

విమానాశ్రయాలమీదను, విమానాలుచేయు కార్ఖానాలమీదను, ఓడరేవులవద్ద జలాంతర్గాములు "ఈ" బోటులు అనబడు ఓడలుఉండునోకలపైనను బాంబులువేయబడెను.

సెప్టంబరు ౨వతేది మ్యూనిషు నగరముపై ౯౦నిమిషాలును, బర్లినుపై ఇదివరలోకంటె చాల దీర్ఘకాలమును ౨ దాడులు జరిగినవి

### బ్రిటిషు విమానాల నష్టాలు

ఈదాడులలోనుండి తిరిగి స్వస్థానమునకు చేరజాలని బ్రిటిషువిమానాల లెక్క క్రిందివిధాననున్నది.

| తేది | నష్టము |
|---|---|
| ఆగస్టు ౨౯ | 3 |
| ఆగస్టు ౩౦ | ౨ |
| ఆగస్టు ౩౧ | ౨ |
| సెప్టంబరు ౧ | ౧ |

## తూర్పుఏష్యాలో నాయకత్వమునకై జపానుకృషి

హాలెండువారివగు ఈస్టిండీసుదీవులకు జపానుచే ప్రత్యేకరాయబారిగా నియోజించబడిన కొబయాషిగారు తూర్పుఏష్యాలో జపానునాయకత్వమువహించునట్లుచేయుటకు రాయబారములు సాగించుటకై సెప్టంబరు ౨ వ తేదినాడు జపానుప్రధాననగరమగు టోకియోనుండి బటేవియాకు బయులుదేరిపోయిరి.

ఇండోచైనాయొక్క ఉత్తరపుసరిహద్దులో చైనావారు సేనలను రక్షణగాపెట్టించుకొనియున్నారు. పోయినసంవత్సరములో చైనీయులకు గొప్పఅపజయములను కలిగించిన సమర్థుడైన చైనాసేనలనాయకుడు పాయ్‌చాంగుసీగారు ఆరక్షణసేనలవ్యవస్థను చేయుచున్నారు. ఫ్రాన్సులో పెటైనుప్రభుత్వమువారు జపానుకోరికలను సంతృప్తిపరచుటకై సిద్ధపడుచున్నారు. ఇండోచైనా దుర్గరక్షణలపై జపాను విమానములు పలుమారులు ఎగిరి పరిశీలనలు చేసినవి.

దక్షిణ చైనాలో జపాను క్రొత్తగా సైనికచర్యలను ప్రారంభించినది. సమర్థులగు జపాను సైనికులు (సోల్జర్లు) ఇండోచైనాలో సంచారము చేయుచున్నారు.

ఉత్తర చైనాలో ఆగస్టు ౨౦వ తేదినుండి చైనాసేనలు పెకింగునుండి హాంకౌ, టున్‌ఫ్రూ, చెన్నాయికినిపోవు రైలుమార్గములను పాడుచేయుచున్నారు. తెలిగ్రాపుతీగెలుకూడ పాడుచేయబడుచున్నవి, చూచౌకును, షన్హైక్వాయికినిమధ్య గొప్పపోరాటము చైనా జపానుల సేనకులజరుగుచున్నవి. అనేకములైన రైలుబండ్లు పాడుచేయబడినవి. త్సావునదిపై ఒకవంతెన పాడుచేయబడినది.

పోయిన జులై నెలలో కౌన్టను రేవుపట్టణమువద్ద జపానువారుఆపియుండిన 'ఫాట్‌షాన్', అను బ్రిటిషువారి ఓడవిషయమై బ్రిటను జపానులకు వచ్చియుండిన వివాదము పరిష్కారమైనది

## తుర్కీ-గ్రీసులు

గ్రీసును ఇటలీబెదరించుచుండుటను ఇదివరలో చూచియుంటిమి. గ్రీసుపైకి ఇటలీ దండెత్తితే బ్రిటనుగ్రీసుకు నాకాదళసహాయము చేయుటకు ఒడంబడికసంగతియు చూచియుంటిమి. ఈవిధముగానే గ్రీసుపై ఇతరరాజ్యము దండెత్తివచ్చినచో సహాయముచేయుటకు తుర్కీకూడ ఒడంబడిక చేసికొనియున్నది. కాని బ్రిటను చేసినసహాయ వాగ్దానవిషయములోవలెనే ఈవిషయములోను రష్యావల్ల తనకు భయముఉండకుండునట్లు ఉన్నచో తాను యుద్ధములోదిగనని తుర్కీ ఒకమినహాయింపును ముందుగానే ఏర్పాటు చేసికొనియున్నది. అందుచే తుర్కీ మరేవిధముగా సహాయముచేయగలదో తేల్చుకొనుటకై తుర్కీ-గ్రీసుల ప్రతినిధులకు సంభాషణలు సాగుచున్నవి. సెప్టంబరు ౭వ తేదినాటికి సంభాషణలింకను సాగుచుండెను.

గ్రీసులో సేనలకు శిక్షణనిప్పించు చున్నారు.



Printed and Published by, G. Ramakrishna Reddy at the Golkonda Power Press. Hyderabad Dn, Editor- S. Prathapa Reddy B. A. B. L.